డా॥ రమానంద్
సమర్పించు

శివశివాని పిక్చర్స్

# మంచిరోజు

మాటలు
ఆవుల శ్రీనాథ్

JAGATI Rs. 2-00 July 1991

36th Year of Publication




## జులై - 1991

## సాహితీ సుధ

వితత జగద్భరంబు దన వీపున దాల్చిన కూర్మనాధుడున్
సతతము చంద్ర భాస్కరుల చక్రము ద్రిప్పు ధృవుండు సజ్జనుల్
ప్రతిభ నజాండ జంతుఫల రంధ్రవశ న్మశకంబులట్ల నిం
దిత విపలార్ధ సంగతి జనించి నశించు దదన్య జంతువుల్

—భర్తృహరి



వరసుమనో భవ్య తరుల కావాల మ - తల్యఘు కలాపాలిక లరు భరణి
సరిలేని తెలి ముత్తెసరుల కొటారు క - ల్యాణ పరంపరల తొలు దేవి
సురవిరమణుల కాకర సీమ శ్రుతి హిత - భాషిత ద్విజకోటి పట్టుగొమ్మ
సరసుల కారామ సరణి శ్రీరంగ గే - హాక్రోడ వాసిని కాటపట్టు

వెలయు నావరణాంబు సంపత హాట - కాండమోపాద పరిచె వృత్తంబు వజ్ర
దంతుర ప్రాంత గంగా నిరంతరాగ్ర - భూరి వరణం బధిష్ఠాన పురవరంబు

—రామరాజ భూషణుని 'వసు చరిత్ర'లో పురవర్ణన



'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 150-00.

ముఖచిత్రం : ఉన్నవ లక్ష్మీనారాయణ

# నిమ్మతొనలు

క్రికెట్ ఫాన్ రవిని సోమూ అడిగాడు; 'పరీక్ష గుండు కొట్టినప్పుడు కూడా లేని విచారం యివ్వాళ ఎందుకొచ్చింది ?'

'క్రికెట్ బంతి లేకపోవడంతో ఏమీ తోచడం లేదు' - అన్నాడు రవి.

'ఈ సోమూ వుండగా నువ్వు నిరాశపడకు. మా అమ్మ చేసిన లడ్డూలు వున్నాయి - పట్టుకొస్తాను.'

—పి పద్మనాభం
కలిచేడు

సార్ మీ షాపులో ఒక వస్తువు కొంటే మరొక వస్తువు ఉచితంగా యిస్తామని ప్రకటిస్తూ వుంటారు. మొదటి వస్తువులోనే రెండో వస్తువు ధర కూడా కలిపి అమ్ముతారా ?' - అని అడిగాడు షాపు యజమానిని చంద్రశేఖరం.

ఈ అమాయకుణ్ణి షాపు యజమాని ఎగాదిగా చూసి, 'మావన్నీ ఫిక్స్‌డ్ ప్రయిసెస్ - ధరల విషయంలో ఎటువంటి తభావతువుండదు. ఈ బిజినెస్ నాకు మా తాత ముత్తాతల నుంచి వచ్చింది,' అన్నాడు.

'నేను ఎకనమిక్స్ చదవుకున్నాను — ఆ వ్యాపార రహస్యమేమిటో తెలుసుకుందామని ....'

'ఓ! అలా చెప్పండి - ఈ ఇన్‌ఫ్లేషన్ రోజుల్లో ఒక వస్తువు అమ్మినా, అమ్మినట్లే కదా అని, ఈ పద్ధతి ప్రవేశ పెట్టాము - అని షాపు యజమాని చెప్పేసరికి, చంద్రశేఖరం, ఏదో అర్థమై పోయినట్టు తల వూపాడు.

—జి యస్ శర్మ
అమలాపురం

శ్రీకాంత్ యిల్లు వొదిలి వెళ్లిపోయి పన్నెండు రోజులయింది. తల్లిదండ్రులు పేపర్లో ప్రకటన వేయించారు. 'మనస్తాపంతో మేము నిద్రాహారాలు మాని, నీ కోసం విలపిస్తున్నాము. నీవు స్కూటర్ కొనుక్కునేందుకు అడిగిన డబ్బు యిస్తాము. తమ్ముడు, చెల్లెలు నీ కోసం బెంగ పెట్టుకున్నారు. ఇది చూసిన వెంటనే నీవు యింటికి రాగలవని వేయి కళ్లతో ఎదురు చూస్తున్నాము.'

శ్రీకాంత్ యింటికి రాలేదు. కాని, తల్లిపేర ఒక ఉత్తరం వ్రాశాడు.

'ఏమని రాశాడేమిటి? డబ్బు ముందే పంపించమన్నాడా నీ సుపుత్రుడు?' అని అడిగాడు శ్రీకాంత్ తండ్రి.

'అది కాదండి - తన బొమ్మ టివిలో కూడా వేయించమన్నాడు'

—ఆర్ విజయశ్రీ
రాజమండ్రి-2

పబ్లిక్ పార్కులో యువతీ యువకులు వూసులాడుకుంటున్నారు.

'మిస్ కరుణా, ఏ ఆదరణ, ఆప్యాయతా లేకుండా గాలికి పెరిగాను. నా అదృష్టం బావుండి, ప్రతిరోజూ మిమ్మల్ని యిలా కలుసుకు, నా మనోభారం వెల్లడించుకో గలుగుతున్నాను. పార్కు సాక్షిగా, ఈ పూల మొక్కలు సాక్షిగా, ఈ సిమెంట్ బెంచీలు సాక్షిగా, మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను' - అన్నాడు ప్రశాంత్ ఎంతో గంభీరంగా.

అతని ఉద్యోగం పర్మనెంట్ అయిందని నెల్లాళ్ళ క్రితం తెలుసుకున్న కరుణ, డబ్బా దసకం సంగతి ఎత్తకుండా, 'మిస్టర్ ప్రశాంత్, మీరంటే నాకు అభిమానమే. అయితే, ఏ ప్రేమ అయినా ఫలించేందుకు, పెళ్ళి అనే తంతు ఒకటి ఉందికదా! ఆ తర్వాత కూల్‌గా ఉంటుంది' అంటూ, అయిస్ క్రీమ్ కప్పు అందించింది.

—కె రామకృష్ణ
రేపల్లె

జగన్నాధం మాస్టారుకి లెక్కలలో బాక్‌వర్డ్‌గా వున్న పిల్లలని ముందు సీట్లలోను, చురుకుగావున్న పిల్లలని వెనక సీటలోను కూచోబెట్టి, బోర్డు మీద లెక్కవేయడం అలవాటు. కన్నా, చిన్నా తెలివైన పిల్లలు ఆయన బోర్డుమీద లెక్కవేయగానే రెండు నిముషాలలో స్టెప్స్‌తో లెక్క పూర్తి చేసేసి, కబుర్లాడుకొనేవారు.

ఒకనాడు జగన్నాధం మేస్టారికి కోపం వచ్చి, కన్నా What is my last word?' అన్నారు.

'Word' అని కన్నా చిలిపిగా జవాబు చెప్పగానే అందరూ గొల్లున నవ్వారు, జగన్నాధంగారితోబాటు.

—చిత్ర
శ్రీరాంనగరం

# పాఠకుల తీర్పు

సంపాదకులకు ; శ్రీగోపాలరెడ్డి గారు అంబేద్కరు గురించి వ్రాసిన వచన పద్యాల సరాలను చదివి ఆనందం పొందుతున్నాను. ఆ మంత్రి పదవుల భారాలను దింపుకున్న తర్వాత, ఎంత బాగా వ్రాశారో! .... చాలా విషాదకరమైన వారం. ఎంతో హృదయ విదారకరమైన యీ ఘాతుక చర్య, ఆ రామానుజుని బోధలనందుకున్న 'తిరుమంత్రపు' ప్రదేశములోనే జరిగి, చీకట్లు వ్యాపింపజేసింది.

—పద్మవిభూషణ్ యన్‌జి రంగా
న్యూఢిల్లీ

డియర్ శ్రీ చందూర్‌గారూ, నమస్కారాలు. 1991 ఏప్రిల్ 'జగతి' ఎంతో అమూల్యమైన సంచిక, దిన పత్రికలు, వారపత్రికల అభిరుచులు, ప్రమాణాలు ఎంతో గందరగోళంగా ఉంటూవున్నాయి. ఈ సమయంలో ఒక చిన్న పత్రిక నెల నెలా చదివి ఆనందించదగ్గ అంశాలతో, పాఠకులకు అందజేస్తున్నారంటే అది మీ ప్రత్యేకత, ప్రతిభ.... 'పండగ సందడి' శీర్షికలో ఇండియన్ పెనోరమాలోకి, ప్రపంచ సినిమాలోకి మీరు యిచ్చిన glimpses కి, తెలుగు పాఠకులు బైటి ఊళ్లవాళ్లందరూ మీకు థాంక్స్ చెప్పవలసి వుంటుంది. కథాసంగ్రహాలు ఛాయాచిత్రాలు కూడా ఇచ్చి, ఈ సంచికను సినిమా ప్రియులకు అమూల్యమైనదిగా రూపొందించినందుకు నా అభినందనలు. 'జగతి' నిజంగా awakened and cultural group) కుచెందిన పత్రిక.

—డి రామలింగం
హైదరాబాదు-44

చందూర్ దంపతులకు ; ఈ ఇండియన్ 'వైయమ్‌సిఏ' నుంచి, ముఖ్యమైన ప్రదేశాలు వేటికి వెళ్లాలన్నా, పది పదిహేను నిమిషాల నడక. ట్రెఫాల్గర్ స్క్వేర్, మ్యూజియమ్స్, ట్యూబ్ ట్రెయిన్ అన్నీ దగ్గరే! ఇక్కడ చరిత్ర ప్రసిద్ధ స్థలాలు మనకెంతో సుపరిచిత మనిపిస్తాయి. విశాలంగా బెంచీలతో పరిశుభ్రం ఉండే పార్కుకి నాలుగు వైపులా బిల్డింగులు చూస్తూ వుంటే, చిత్రకారుని బొమ్మేదో చూస్తున్నామా అనిపిస్తుంది. వసంత మవడం వల్ల, రంగు రంగుల పువ్వులు కలకలమని నవ్వుతూ నేత్రానందం కలిగిస్తూంటే, శారదాంబక్కే జ్ఞాపకమొస్తున్నారు .... గూటాల కృష్ణమూర్తిగారికి 'జగతి' లోని కేసరిగారి చిన్ననాటి ముచ్చట్లు ఎంతో బావున్నాయట.

—రాధా శివస్వామి
లండన్

# వెన్నెల కెరటాలు

## వెంకయ్యగారు

జాతీయ కళాశాలలో ఉంటున్న కాలంలోనే (1916) వెంకయ్యగారు భారతదేశానికి ఒక జాతీయ పతాక అనే పుస్తకం వ్రాశారు. దానికి ఆనాటి వైస్రాయి కార్యవర్గ సభ్యుడు సర్ బి. ఎన్. శర్మ తొలిపలుకు వ్రాశారు. 'కృష్ణా పత్రిక' ఆ పుస్తకాన్ని గురించి ఎంతో ప్రశంసిస్తూ సంపాదకీయాన్ని ప్రచురించింది. ఈ గ్రంథ రచనతో వెంకయ్యగారికి స్థిర ప్రతిష్ఠ లభించింది. ఆనిబిసెంట్ ప్రారంభించిన హోంరూలు ఉద్యమంలో కూడా వెంకయ్యగారు పాల్గొన్నారు.... .... బెజవాడ [ఇప్పటి విజయవాడ]లో 1921 లో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశం జరిగింది. గాంధీ మహాత్ముడు వెంకయ్యగారు జాతీయ పతాక విషయంలో చేస్తున్న కృషిని అప్పటికే బాగా ఎరిగి ఉన్నారు. అంచేత బాపూజీ వెంకయ్యగారిని ఆహ్వానించి, జాతీయ పతాక నమూనాను తయారు చేసి ఇమ్మని కోరారు. మూడు గంటలలో అందజేశారు.

—భావరాజు నరసింహారావు
'శ్రీవాణి'లో

## 'ఎలియనేషన్'

'ఎలియనేషన్' అన్న సిద్ధాంతాన్ని ప్రప్రథమంగా ప్రతిపాదించిన వ్యక్తి హీగెల్. ఆ తర్వాత కారల్‌మార్క్స్ సమాజ - ఆర్థిక పరిస్థితుల కనుగుణంగా ఈ విషయాన్ని ప్రతిపాదిస్తే, మానవ మాత్రుడి మానసిక స్థితిని అర్థంచేసుకునే ప్రయత్నంలో ఇదే విషయాన్ని ప్రస్తావించారు మనస్తత్వవేత్తలు.... వ్యక్తుల చిత్తవృత్తులు, సామాజిక స్థితి గతులు అన్యోన్యాశ్రితాలు కాబట్టే కొన్ని కొన్ని విషమ పరిస్థితులలో ఏవో కొన్ని విషాదానుభూతులకు లోనై సమాజంతోను యితర వ్యక్తులతోను సంబంధ విచ్ఛేదం చేసుకుని ఒంటరితనానికి గురి అవుతాడు వ్యక్తి. ప్రకృతి ఒడిలో కళ్ళుతెరిచిన పసిబిడ్డ క్రమంగా ఆత్మజ్ఞానం అభివృద్ధి చెందటంవల్ల ప్రకృతికీ తనకు మధ్య గల తేడాలను గుర్తిస్తాడు. ఆ తర్వాత తన విశిష్ట వ్యక్తిత్వంతోనూ - ఒక విధమైన awareness తోను యితర వ్యక్తుల నుంచి కూడా విడిపోతాడు. అయితే హీగెల్ అన్నట్టు వ్యక్తిగత విశిష్టతలన్నీ వైశ్వీక విశిష్టతలోనివి.

—ఉషా లావణ్య
'స్రవంతి'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

జగపతీ వారి

## 'ఆస్తిపరులు'

తెలుగు దేశంలో జమీందారీలు అంతరించి చాలాకాలమైనా, తెలుగు సినిమాల్లో మాత్రం అవి సజీవంగా నిలిచివున్నాయి. ఏసుక్రీస్తు నుంచి మహాత్ముని వరకూ మంచివాళ్లు ఎలా బలి అవుతున్నదీ చెప్పే ఒక జమీం దారుకి (గుమ్మడి), ఇద్దరు తనయులు. విద్యా వినయభూషణుడగు అన్నగారు కృష్ణ (నాగేశ్వరరావు), పన్నగము వలె వర్జింపడగు అనిపించే దుర్జనుడైన తమ్ముడు భాస్కర్, లేక, బాజీ (జగ్గయ్య) ; మిడిసిపడే అత్త కూతురు రాధ (జయలలిత) యింటి కోడలు కాక తప్పదు.... డబ్బు కోసం తండ్రిని కాల్చిచంపిన కొడుకుని, మరణశయ్యపై వున్న తండ్రి క్షమించవచ్చునేమోగాని, బంధువర్గం ఎలా సహించగలుగుతుంది ? ఒక హంతకుని హత్యను దాచి, కపటనాటకంతో, ఈత రాని తనని నీటముంచి చంపే హత్యా ప్రయత్నం జరిపిన మీదట కూడా ఏదో మార్పు వస్తుందని కృష్ణ ఆశించడం ఒక విధమైన వెర్రిబాగుల తనంగా కనిపిస్తుంది. పగిలిన మోటార్ బోటు ముక్కలు ఎక్కడ తేలాయి ? నీటిలోని శవం వొడ్డుకుకొట్టుకు రాకుండా ఏమయింది ? కృష్ణ వేసుకున్న కోటు చూసి అన్నయ్య చచ్చిపోయాడని పెడపెట్టున ఏడవగానే, దగుల్బాజీ భాస్కర్ మాటలు అత్త, అత్తకూతురూ ఎలా నమ్మారు ? వేణుగోపాలుడు ఒక్కొక్కరితో ఒక్కొక్క విధంగా లుకుతున్నాడని చెప్పే ' శీనులో కృష్ణని గుర్తించలేనంత అవివేకురాలా ? కానేరదు. కత్తియుద్ధం, పాడునుయ్యి, పాము ప్రమాదం, ఆద్యంతాలలో కథని అతికే బేబీ పద్మిని, ఆభరణాలు పెట్టె — వీటన్నిటితో, తినతినగ వేము తియ్యనయిందన్నట్లు, పాలు హొయ్యగా హొయ్యగా పాము మచ్చికయిందనే నీతితో, హృదయంనిండా ప్రేమే నిసలైన ఆస్తి అనే హితవచనంతో కథ ముగించేందుకు, సన్నివేశాలు సమకూర్చారు. పిటని కొట్టలేని సోగ్గాడి పాట ఫరవాలేదుగాని, నన్ను దోచుకుపో మగవాడా - అని పెళ్లీడు కొచ్చిన కన్య పాడటం సభ్యతా విరుద్ధంగా ఉంది. దర్శకులు : వి మధుసూదనరావు నిర్మాత : విబి రాజేంద్రప్రసాద్.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - అక్టోబరు 1966

కాలిబాట లేని అడవులలో ఆనందం వుంది ; ఒంటరి తీరాన వేకువ కాంతి వుంది ; సముద్ర గర్జనలో సంగీతం వుంది ; అందుకని ప్రకృతి నెక్కువ ప్రేమించి మనిషిని తక్కువ చేయను. — బైరన్

# మానవ ప్రగతి

## కుమార్ బార్వే

మేరిలాండ్‌లోని మాంట్ గోమెరీ కౌంటీ నుంచి అసెంబ్లీకి ఎన్నికైన 32 ఏళ్ల కుమార్ బార్వే సామాజిక విషయాలలో 'లిబరల్'; ఆర్థిక విషయాలలో 'కన్సర్వేటివ్' - ఈ ఎన్నిక సందర్భంగా పర్యావరణం, విద్య, స్త్రీల హక్కులను ప్రధానాంశాలుగా చేపట్టారు. ఎన్నికలప్రచారంలో భాగంగా కుమార్ బార్వే ఇంటింటికి వెళ్లి వివిధ అంశాలపై తన వైఖరిని, చిత్తశుద్ధిని ఓటర్ల మనసుకు హత్తుకునేలా వివరించారు. మూడవతరం (థర్డ్ జనరేషన్) అమెరికన్ అయిన బార్వే వాషింగ్టన్ నగరంలోని జార్జి టౌన్ యూనివర్సిటీలో 'అకౌంటింగ్'లో డిగ్రీ పొందారు. భారత స్వాతంత్ర్యోద్యమనేత గోపాలకృష్ణ గోఖలే బార్వే పితామహునికి బంధువు. ఈ పోటీ చేయడానికి సంకల్పించక ముందు కూడా బార్వే రాజకీయాలలో చురుకుగా పాల్గొనేవారు. అమెరికా ప్రతినిధుల సభకు, 'సెనెట్'కు పోటీ చేసిన డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థుల తరపున ఆయన ఉత్సాహంగా ప్రచారం చేశారు. 1988 అధ్యక్ష ఎన్నికలలో మశాచుసెట్స్ గవర్నర్ మైకేల్ డుకాకిస్ తరపున జరిగిన ప్రచార కార్యక్రమంలో కూడా ఆయన పాల్గొన్నారు. బార్వేకి ఉజ్వలమైన రాజకీయ భవిష్యత్తు వున్నదని, ఆయన అమెరికన్ కాంగ్రెస్ సభ్యుడయ్యే అవకాశాలు పుష్కలంగా వున్నాయని, బార్వే సాధించిన ప్రస్తుత విజయం అమెరికాలోని భారతీయ సంతతి ప్రజలకు పెద్దవరం లాంటిదని డెమొక్రాటిక్ పార్టీ జాతీయ సంఘం సభ్యుడు రమేష్‌కపూర్ పేర్కొన్నారు.... (అమెరికా సమాచారశాఖ)

## 'మే - డే'

ప్రతి ఏటా మే నెల ఒకటవ తేదీన, అంతర్జాతీయ కార్మిక సెలవు దినంగా పాటించే మేడే పుట్టుక అమెరికాలో జరిగిందని, చాలామందికి తెలియదు. అమెరికాలో సివిల్‌వార్ ముగిసిన వెంటనే 8 గంటల పని దినం కోసం కార్మిక ఉద్యమం

ప్రారంభమైంది. ఈ మేరకు 1968 జూన్ 25 వ తేదీన ఒక చట్టాన్ని అమెరికా కాంగ్రెస్ ఆమోదించింది; శాసన సభలు కూడా ఇదేవిధమైన చట్టాలను ఆమోదించాయి. 1886 వ సంవత్సరం మే ఒకటవ తేదీన, సుమారు మూడున్నర లక్షల మంది అమెరికా కార్మికులు సమ్మె ప్రారంభించారు. దీనివలన 11 వేలకు పైగా వ్యాపార సంస్థలకు నష్టం కలిగింది. ఫలితంగా, సమ్మె చేస్తున్న 50 వేల మంది పైగా కార్మికులు రోజుకు 8 గంటలు మాత్రమే పని చెయ్యడానికి అనుమతి పొందారు. సమ్మెలో పాల్గొనని మరో లక్షా 50 వేల మంది కార్మికులకు కూడా ఈ అనుమతి లభించింది. మేడే ఆందోళనకు చికాగో కేంద్ర స్థానం అయినప్పటికీ, న్యూయార్కు, బాల్టిమోర్, ఉత్తర అమెరికా లోని నగరాలు కార్మికులు కూడా సమ్మెలో పాల్గొన్నారు. 1886 వ సంవత్సరం ద్వితీయార్థంలో యజమానులు కార్మికులపై కఠిన చర్యకు పూనుకున్నారు. దీనితో కార్మిక ఉధ్యమ నాయకత్వంలో మార్పులు జరిగాయి. సెయింట్ లూయీలో 1888 లో జరిగిన సమావేశంలో, 1889 మే ఒకటవ తేదీన 8 గంటల పని దినం కోసం తిరిగి సమ్మె చెయ్యాలని నిర్ణయించారు. మేడే సమ్మెలు విజయ ఢంకా మోగించాయి. కార్పెంటర్స్ యూనియన్ దేశవ్యాప్తంగా ఆందోళన ప్రారంభించింది. 8 గంటల పని కోసం జరిపిన ఈ పోరాటమే అమెరికాలో ఆధునిక ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి దారి తీసింది. ఈ ఉధ్యమం క్రమంగా ఇతర దేశాలకు కూడా వ్యాపించింది. అమెరికన్లు ప్రారంభించిన 8 గంటల పని ఉద్యమం అట్లాంటిక్ నుంచి పసిఫిక్ మహా సముద్రానికీ, న్యూ ఇంగ్లండు నుంచి కాలిఫోర్నియాకు వ్యాపించిందని కార్ల్ మార్క్స్ వ్యాఖ్యానించారు... (ఎన్.ఎన్. రావు - పిబిఐ.)

## ద్విపాదులు

పరిసరాలకు బానిస కాని జంతువు - మానవుడొక్కడే! వానర రూపం పూర్తిగా వొదలని తొలి మానవులు, ఎన్నో లక్షల సంవత్సరాల క్రితం చెట్టు దిగి నేలమీద కొచ్చారు. నిటారుగా నిలబడి నడవడమూ, ఆహారం వెతుక్కోవడమూ, శత్రు బారి నుంచి తప్పించుకోవడమూ వారు నేర్చుకున్నారు. నాల్గుకాళ్ల జంతువు నుంచి రెండు కాళ్ళ మనిషిగా పరిణామం చెందడానికి, లక్షల సంవత్సరాలు పట్టింది. సమస్త జంతు జాలంలో మహోన్నత శ్రేణికి చెందినవి వానరాలే. మానవులకు అత్యంత సన్నిహితమైన బంధువులూ యివే! అందు చేతనే, "కోతుల్ని నా పూర్వీకులుగా ఆనందంతో అంగీకరిస్తాను" - అని సుప్రసిద్ధ బ్రిటిష్ శాస్త్రవేత్తయైన థామస్ హక్సెలీ అన్నాడు. ప్రైమేట్స్‌ను రెండు విభాగాలుగా శాస్త్రజ్ఞులు విభజించారు. 1 ప్రోసిమియా (కోతు

లకు పూర్వమున్న జంతువులు)
2. యాంత్రోపాయిడ్ (మానవుల్ని పోలిన జంతువులు) యాంత్రోపాయిడ్స్‌లో రెండు కుటుంబాలు కోతులకూ, వొక కుటుంబము వానరులకూ చెందుతాయి. గిబ్బన్-ఒరాంగ్‌టాన్ - గెరిల్లా - చింపంజీలు వానర కుటుంబానికి చెందినవి. శరీర నిర్మాణమూ తెలివితేటల్లో మానవునికి అత్యంత సన్నిహితమైనవి. ఈ గెరిల్లా - చింపాంజీలే, నిటారుగా నిలబడి, రెండు కాళ్ళతో నడవగల శక్తిని, ఇవి క్రమేణ సంపాదించ గలిగాయి. ఈ శక్తియే వానరం నుంచి నరుడుగా పరిణామం చెందడానికి దోహదం జేసిన అత్యంత ప్రధానమైన లక్షణం. ఈ సుదీర్ఘ పరిణాయం జరగడానికి దాదాపు ఇరవై లక్షల ఏళ్ళు పట్టిందని శాస్త్రజ్ఞులు అంచనా వేశారు.........
(అమ్మాజీ సర్కార్.)

వక్ర భాష్యం చెప్పగలిగేటంతటి పాండిత్యం సంపాదించాడతను.

ఉదయకాంతులు ప్రభాతాన్ని సూచిస్తున్నాయి; ప్రతి ప్రభాతం లోను కర్పూర నీరాజనం ఉంది.

పర్వత శిఖరాలు కూనిరాగం తీస్తాయి; పెద్ద పట్నాలు నానా యాతనా పెడతాయి. —బైరన్

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



రెండు సంవత్సరాల క్రితం కేసరి గారి 'చిన్ననాటి ముచ్చట్లు' ఈ చిన్న పత్రికలో ధారావాహికంగా ప్రారంభించినప్పట్నుంచీ, దేశవిదేశాల నుంచి ప్రశంసా లేఖలు అందుతున్నాయి. కేసరిగారి పేరు వినడమే గాని ఆయన జీవితమింత రసవంతమూ, కళాన్వితమూ, చరిత్ర దర్పణమూ, ఆదర్శప్రాయమూ అని చాలామందికి తెలియదు. రాదారి పడవ ఎక్కేందుకు చేతిలో దమ్మిడీ లేక, ఒంగోలు దగ్గిరున్న తన పల్లెటూరి నుంచి కాలినడకని ఈ పట్నం చేరుకు, విద్యుద్దీపాలు లేని కాలం నుంచి విద్యున్మాలికల వైభవందాకా చూసి, ఈ మహానగరంతో బాటు తనూ పెరిగి, తను సంపాదించిన ఐశ్వర్యాన్ని మహిళాభ్యుదయానికి, సమాజోన్నతికి, సంగీత సారస్వత సేవకు విద్యాదానానికి వినియోగ పర్చిన మహనీయులాయన.... కేసరిగారి జీవిత విశేషాలు పుస్తక రూపంలో రావాలని, తమ కొక కాపీ కావాలని ఎందరో వ్రాస్తున్నారు. త్వరలోనే వెలువడుతుంది.

ఏమి ఉద్యోగం చేతుమా అని ఆలోచింప నారంభించాను. ప్లీడరు గుమస్తా చేయు మని ఒకరు సలహా యిచ్చారు. ఒక వకీలుకు సిఫారసు చేసినారు. వారివద్ద గుమాస్తాగా చేరినాను. ఆ వకీలు నెలపూర్తి అయితేగాని జీతమివ్వ బడదు, పని నేర్చుకో అన్నారు. నా కప్పచెప్పబడిన పని - వకీలు గారి గౌను, ఇంతంత లా పుస్తకాలు - ఎద్దుమోత నెత్తిన పెట్టుకొని హైకోర్టు మెట్లు ఎక్కడం, దిగడం, నెల అయిపోయింది. అన్నానికి ఇబ్బందిగా ఉన్నది; జీతం ఇవ్వండి అన్నాను. "మీరింకా పని నేర్చుకోనిదే ; రెండు మూడు నెలలు నేర్చుకున్నాక - జీతం ఆలోచిద్దాము" అన్నారు. ఎన్నాళ్లు గౌను, లా పుస్తకాలు నెత్తిన పెట్టుకుని మోస్తూ - హైకోర్టు మెట్లు ఎక్కే, దిగే విద్య నేర్చేదను - అని నాకు తోచింది. ఆ దినంతో దానిని వదలుకున్నాను.

అప్పుడే క్రొత్తగా 'ట్రాంబండి' వేసినారు. ట్రాంబండలో కండక్టరుగా చేరుదామని బుద్ధిపుట్టినది. దరఖాస్తు వేశాను - "ఖాళీలేదు" అని జవాబిచ్చారు. అది అట్లా తొలగిపోయింది.

ఎవ్వరి సలహాలేకుండా నాలో నేను ఆలోచించుకో నారంభించాను. ఏదైనా ఉద్యోగం చేసే బ్రతకవలెను - అనే నిశ్చయం ఇంకా దృఢపడ్డది. ఆ ఉద్యోగం, ఒకరి సలహా, సిఫారసు లేకుండా దొరకవలెను. అప్పటికీ ఇప్పటికీ - చెన్నపట్నంలో, రెండు ఉద్యోగాలు హెచ్చు విద్య అవసరం లేకుండా, ఏ సిఫారసు లేకుండా దొరికేవి, - ఉన్నవి - అందొకటి - బ్రోకర్ పని. దీనికి తల గుడ్డ, కోటు, వల్లెవాటు, చేతికర్రో, గొడుగో, చెప్పులు. ఇట్లా కొంతవేషం, భేషజం ఉండవలె ; మరొకటి కూడా అవసరము ; అది 'మద్రాసు పితలాటకం' అనే విద్య. నాకు, ఆ విద్య చేత కాదు. ఆ ఉడుపులు వేసుకొనే శక్తి లేదు. అదీ మానుకున్నాను.

రెండవది : నాటు వైద్యం. ఆయుర్వేద వైద్య విద్య నేర్పే పాఠశాలలు ఆ రోజుల్లో మద్రాసులో లేవు. ఆ వైద్య విద్య తెలిసినవారివద్ద గురుకులవాసం చేసి నేర్వవలసినదే. ఒక నంబి ఆచార్ల వద్ద, ఒక శాస్త్రులగారి వద్ద ఆ విద్య నేర్చినాను. ఆ నంబి ఆచార్లగారికీ శాస్త్రము విశేషమేమీ తెలియదు. తాతముత్తాతల నాటి నుండి అనుశృతంగావచ్చే వైద్యవృత్తి మాత్రం అవలంబించినారు. వారు చేసిన కుప్పెకట్లు కొన్ని వీరి వద్ద ఉన్నవి. వాటి సహాయంతో అనుభవంకొద్దీ ఆయన 'సంచికట్టు' వైద్యం సాగించేవారు. ఆయన నాకు నేర్పగలిగిందేముంది ? ఏదో ఇంత మందు కల్వంలో వేసి, కొన్ని నిమ్మపండ్ల రసం పిండి మర్దన చేయమనేవారు.. ఎంతకాలం అట్లా మర్దన చేస్తే నాకు విద్య అంటుతుంది ? ఆయనను వదిలిపెట్టినాను.

మహదేవ శాస్త్రిగారు వైద్యశాస్త్రం తెలిసినవారు. వారివద్ద కొంతవరకు శాస్త్రరీత్యా విద్య నేర్చినాను. వైద్యగ్రంథములు చదివి వైద్య రహస్యములు బోధపరుచు కున్నాను. కొన్ని మందులను తయారుచేసి, కోమట్ల ఇండ్లలో వైద్యం చేసేవాడను. శ్రీ పాలూరి రాజం శెట్టిగారు నీలిమందు వర్తకం, చేసేవారు. వర్తకులలో ప్రముఖులు, కన్యకాపరమేశ్వరీ దేవాలయపు ఆస్తికి ట్రస్టీలలో ముఖ్యులు, సరిగా ఆకాలమందే వారు కన్యకా పరమేశ్వరీ ధర్మ ఆయుర్వేద వైద్యశాల అని యొకటి స్థాపించినారు. దానిలో శ్రీ పండిత డి. గోపాలాచార్యులుగారిని వైద్యులుగా నియమించినారు. శ్రీ రాజం శెట్టిగారికి నేను తరచుగా పుల్లటి మందులు పెడుతూ ఉండేవాడిని. వారు దానికని నా యందెంతో దయగా ఉండేవారు. ఆ పరిచయంచేత వారు మిగత ట్రస్టీలకు సిఫారసుచేసి, నన్ను కూడా ఆ కన్యకా పరమేశ్వరీ ట్రస్టు ధర్మాయుర్వేత వైద్య శాలలో ఆచార్లగారికి సహాయ వైద్యులుగా నియమింప చేశారు. నేనూ ఆచార్లు గారూ కలిసి ఆ వైద్యశాలలో 4 సం॥లు పని చేశాము. పిదప వారికీ నాకూ సరిపడలేదు. నేను ఆ ఉద్యోగానికి రాజీనామా నిచ్చినాను. స్వయంగా, స్వాతంత్ర్యముగా 'వైద్యాలయం' ఏర్పాటు చేసుకొని, పొట్టపోసుకోదలచినాను. ఆ ధర్మవైద్యశాల యుండిన నారాయణ మొదలివీధిలోనే - ఒక ఇల్లు నెల 1 కి రు. 1-6-0కు బాడుగకు తీసుకొని వైద్య మారంభించాను. మందులు చేసుకోడానికి కాపురముండడానికీ అదే యిల్లు. ఈ నూతన యత్నారంభం చేసిన రోజుననే - ఆయింటి వీధిగోడమీద, బొగ్గుతో, పెద్ద అక్షరాలలో,

## 'కేసరికుటీరం, ఆయుర్వేద ఔషధశాల'

అని వ్రాశాను. అదే నా అదృష్ట రేఖ ధరించిన మొదటి సైన్‌బోర్డు (Sign Board).

అప్పటి నుంచీ ఇప్పటివరకు, ఈ వృత్తిలోకూడా నాకు చాలా కష్టములు కలిగినప్పటికి వాటినన్నిటినీ జయించుకొని, కొన్ని సంవత్సరములుగా ఏ ఇబ్బందియు లేక స్థిరపడి, ఇప్పటికి మీ యెదుట ఈ విధంగా నిలువగల్గి నాను. ఇదీ నా నిజవృత్తాంతము.

'ఇన్ని కష్టములు పడిన్నీ చేసిన ఘనకార్యములేమిటి' అని మీరు నన్ను అడుగవచ్చును. ఒక్కొక్కటిగా చెప్పెదను.

చిన్నతనంలో, ఇల్లువాకిలి లేనివానినిగా చేసి నన్ను రావిచెట్టు క్రింద కాపురము చేయించినందుకు - దేవుని మీద కోపం వచ్చి - నివసించడానికి మంచి భవనాన్ని నిర్మించుకున్నాను.

చిన్ననాడు విద్యకై పడిన కష్టములు మరువజాలక ఈ విద్యాలయం స్థాపించినాను.

చదువుకొనునప్పుడు నన్నాదరించి, నాకు అన్నముపెట్టిన అమ్మల అమృతహస్తములను ఏటేటా 'గృహలక్ష్మి స్వరకంకణము' అనే పేరుతో బంగారు తోడాలను తొడుగుతున్నాను.

ఇప్పుడు మరొక కార్యం చేయదలచుకొన్నాను. నన్ను ఈ స్థితికి తెచ్చినది స్త్రీల ఆరోగ్యమునకై తయారుచేయపడుచున్నది 'లోధ్ర' అనే ఔషధ రాజము, ఔషధము వల్ల నాకింత సంపాద్యము చేకూరినది. కావున ఈ ద్రవ్యాన్ని 'స్త్రీధనము'గా భావిస్తున్నాను. స్త్రీధనము పవిత్రమైనది. ఆ ధనం అంతా దిగమ్రింగిన అజీర్ణము కలుగుననే భయముతో, ఈ దినం స్త్రీలవిద్యాభివృద్ధికై - లక్ష రూపాయలను మా స్కూలు కమిటీ పరముగా ఇచ్చుచున్నాను. ఈ ధనం వెచ్చించి, కేసరికన్యా విద్యాలయం అనే పేరుతో ఆడబిడ్డలకు ప్రత్యేకంగా ఒక విద్యాలయం నెలకొల్పండి - అని ఈ కమిటీ వారిని కోరుచున్నాను.

'క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవిత మావయోః
యమస్య కరుణా వాస్తి ధర్మస్య త్వరితా గతిః'

సమాప్తం



# తొలి పలుకు

పేదరికమున పుట్టి, అసహాయులై, స్వయంకృషిచే మేధాశక్తులను గడించి, విశేషధనము నార్జించి అనేక సంఖ్యాకులకు పలువిధముల సహాయ్యము చేసి, విద్యాసంస్థలకు లక్షల కొలది విరాళము లొసంగి, నాగరికులై స్నేహపాత్రులై, ఆంధ్రదేశమునకు మాసిపోని వన్నె తెచ్చిన ధన్యజీవులు శ్రీయుతులు కేసరిగారు.

అట్టిమహనీయుని జీవిత చరిత్ర సమకాలికులకేగాక యికముందువచ్చు తరముల వారికి కూడ మార్గదర్శకము కాగలదు.

ఎవరిగాథవారే చెప్పవలననియు ఆంగ్ల భాషలో యొక న్యాయము కలదు. ఇతరులు వ్రాయు జీవిత చరిత్రలకన్న ఆత్మకథలే రసవంతములు.

ఈ ముచ్చట్లలో శ్రీ కేసరిగారు చారిత్రకారుల పద్ధతి నవలంబించలేదు. జీవితాంశములను వర్షక్రమముగా వర్ణింపలేదు. చిన్ననాటి విషయములను, దృశ్యములను, అనుభవములను స్మరణకుతెచ్చుకొని సంభాషించు ధోరణిలో అందలి విశేషములను తెల్లజేసి యున్నారు. ఏబదిసంవత్సరముల క్రింద గుంటూరు, నెల్లూరు జిల్లాలలోని విషయములు చెన్నపట్నంలోని విషయములు యిచ్చట వర్ణింపబడినవి. కేసరిగారు తమ జీవితములో స్వార్థము నెప్పుడు అపేక్షించిన వారుగారు. ఈ పుస్తకములో కూడ తమ స్వంతసంగతులతో బాటు మద్రాసులోని సాంఘిక, వైజ్ఞానిక ఉద్యమములను వర్ణించియున్నారు. ఇప్పటి వారికి అనేకులకు వారు వ్రాసిన విషయములు తెలియవు. వారి వ్రాతవలన గతించిన విషయములు సజీవములగుచున్నవి. ఆ విషయములను స్వయముగా తెలియనివారి కందరకు ఈ గ్రంథము అమూల్యమైనది.

1947 వ సంత్సరములో కేసరి విద్యాలయ స్థాపకుల వార్షికోత్సవము శ్రీయుత కొంకి రామమూర్తిగారి ఆధిపత్యము క్రింద జరిగెను. అప్పుడు శ్రీ కేసరిగారు మంచి ఆరోగ్యములో లేరు. అట్లుండియు వారా సభకు వచ్చిరి. లక్ష రూపాయలు కేసరి కన్యావిద్యాలయ స్థాపనమునకు విరాళము నొసగిరి. ఆ సందర్భమున వారొక గొప్ప ఉపన్యాసము చేసిరి. ఆ పలుకులను విన్న శ్రీ రామమూర్తిగారు ఆ సభకు వచ్చి శ్రీ కేసరిగారిని సందర్శించి, వారి పలుకులను విను భాగ్యము కలిగినందులకు మిక్కిలి తృప్తి చెందిరి. అదేవిధముగ ఆ రోజున ఆ సభకు వచ్చిన వారందరు తలచిరి. ఆ పలుకులను విన్నవారు, వాటిని మరువజాలరు. ఆ ప్రసంగములో కేసరిగారు తమ జీవితములోని ముఖ్య అంశములను, వారు కష్టపడు సమయమున పుణ్యస్త్రీలు వారికి సహాయ్యము చేసినదియు, ఎందులకు వారీవిద్యా సంస్థలకు స్థాపించినదియు విస్తరించి చెప్పిరి.

ఈ గ్రంథము చదివినవారికి ఆ దృశ్యము జ్ఞప్తికిరాక మానదు. ఆ భావములే మరల నీ గ్రంథము చదివినపుడు స్ఫురింపకమానవు.

శ్రీ కేసరిగారు వైద్య శాస్త్రములో మిక్కిలి ప్రతిభను గడించి వ్యాపారము పెద్దచేసి అనేక నూతన విధానములతో వారి కార్యములను పెంచి పెద్ద

చేయుటతోనే తృప్తి చెందలేదు. వారు రాజకీయ విషయములలో పాల్గొనక పోయినను వారికి సంఘసంస్కరణములో అత్యంతమైన ఉత్సాహము, సాంఘి కోద్యమములకు వారు చేసిన సహాయ్యములు ఈ పుస్తకము చదివినవారికి తెల్లముకాగలవు. ఇంతియకాక పాటకులను పలువురను పోషించి వృద్ధికి తెచ్చియున్నారు. సంఘసేవచేయు ఉద్యమములకు పలుభంగుల దోహదము చేసియున్నారు. విద్యార్థులకు అనేక సంఖ్యాకులకు సహాయ్యము చేసియున్నారు.

ఈ చిన్ననాటిముచ్చట క్లిష్టమగు సమస్యలతో సంబంధములేక మనకం దరకు బోధపడు విషయములతో నిండియున్నది. శ్రీ కేసరిగారికి దృశ్యములు వర్ణించుటయందు మిక్కిలి చాతుర్యమున్నది. పాతాదృశ్యములను సాక్షాత్క రించుకొని ఎప్పటి అనుభవములనో మరల మనసుకు తెచ్చుకొని వాటికి ప్రాణంపోసి రసభరితముగ వర్ణించెడి శక్తి అందరికి అబ్బదు. రెండవ ముచ్చటయగు 'పార్కు ఫేర్ పరశురామప్రీతి' చెన్నపట్టణమును గురించి వ్రాసిన 8, 9, 10 వ ముచ్చట్లు, 11 ముచ్చటయగు 'నాచిన్ననాటి మాఊరు' - శ్రీ కేసరిగారి వర్ణనా శక్తిని చాటుచున్నవి. శ్రీ కేసరిగారి యాత్రల వర్ణనము మిగుల ప్రశంశనీయము. అందు వివిధ రాష్ట్రములవారి జీవిత విధానము, సాంప్రదాయములు, మర్యాదలు సరళముగా వివరింపబడి యున్నవి. శ్రీ కేసరిగారికీ హాస్యరసము ఎక్కువ. వారు చాల మితభాషియని వారిని ఎరిగినవారు అనేకులు అభిప్రాయపడెదరు. కాని, వారికి మిక్కిలి పరిచయము గలినవారితో యిష్టాగోష్టిగా ఉన్నపుడు హాస్యముగ విషయము లను వర్ణింపగల శక్తి వారికి గలదు.

కథచెప్పుట సులభమగు కళకాదు. అందరు చెప్పలేరు. రసము వెలితికాకుండ ఆత్మ అనుభవములను సాదృశ్యము చేయగల నేర్పు గొప్ప రచయితులకు మాత్రము సాధ్యము. అట్టివారిలో శ్రీ కేసరిగారు ఒకరని చెప్ప వలెను. శ్రీ కేసరిగారి శైలి, వర్ణించు ధోరణి మిక్కిలి రుచికరములు. ఇది శ్రీ కేసరిగారు ఆంధ్రవాణికి యిచ్చిన కానుక. చిరకాలము ఈ పుస్తకము ఆంధ్రసారస్వతము నలంగరించగలదని నా నమ్మకము.

7-3-53 మెదవోలు శేషాచలపతి

అడ్వకేటు, మద్రాసు

## ప్రశస్థి

పెద్దల జీవితము ఆదర్శప్రాయము - పూర్వ పుణ్యము లభించినగాని మనుజుని జీవయాత్ర సరీగా కొనసాగనేరదు. పురుష ప్రయత్నము దానికి

తోడుపడవలెను. కంసాలిచే సంస్కరింపనిది పదునారువన్నె బంగారమునకైనను మెరుపురాదు. ఆదిలో ఒక వ్యక్తి ఎంతకష్టపడునో తరువాత అంత ఫలితము కలుగును. కష్టములకోర్చి దైవముమీద భారమువేసి నిశ్చల మనస్సుతో కార్యదీక్షవహించి కృషిచేసిన ఫలితము రాకపోదు. జయము తప్పదు. అట్టి మహనీయుల స్వీయచరిత్ర ఇతరులకు నావికునకు చుక్కాని వలె మార్గదర్శి కాగలదు. తెలుగుభాషలో స్వీయచరిత్ర రచనలు చాలా కొలదిగా యున్నవి. "నాచిన్ననాటి ముచ్చట్లు" అను మృదుమధురమైన పేరుతో డాక్టరు కేసరిగారు వారి జీవిత చరిత్రవ్రాసి తెలుగుభాషకు, తెలుగు దేశమునకు మహోపకారముచేసిరి. సులభశైలి, తేటతెలుగు, చదువుట ప్రారంభించిన ముగియువరకు వీడుటకు మనసురాని విషయములు గలవు.

డాక్టరు కేసరిగారు తెలుగు ప్రపంచమునకేగాక తదితరులకు చిర పరిచితులు. ఆడంబరములేని జీవితము, నిశ్చలమైన దైవభక్తి, మరచినను మరపురాని ప్రేమ, స్త్రీలయెడల ఎడతెగని మాతృభక్తి, బీదలను, విద్యార్థులను రక్షించు నిత్యవ్రతము, కళలయెడల భాషయందు అభిమానము, మితభాషణ మొదలగు సుగుణపుంజములుగల కర్మయోగి. వీరి దాతృత్వమునకు విద్యాభిమానమునకు ఈ నగరమునందలి కేసరి విద్యాలయములే సాక్షి. వీరు పేరు సువర్ణాక్షరములతో చిరస్థాయి అయినది. ఆంధ్రులు వీరి ఋణము తీర్చుకొనలేరు. అష్టకష్టములు అనుభవించి స్వశక్తిచే ధనమార్జనచేసి సద్వినియోగముచేసిన మహాపురుషుడు. ఐశ్వర్యముతో తులదూగినను వెనుకటిచరిత్ర మరువక, బీదలకు, స్త్రీలకు, విద్యార్థులకు తదితరులకు నాస్తి అనకుండా ధనసహాయము ఇతర సహాయముచేసిన సత్పురుషుడు. అట్టివారి జీవితచరిత్ర యెవ్వరికి రుచించదు.

ఇది 'చిన్ననాటి ముచ్చట్లు' మాత్రము కల గ్రంధముకాదు. అనాటి చెన్న నగరము ఎట్లుండునో, అప్పటి విద్యార్థులెట్లు కాలము గడిపిరో, రోడ్లు, కాఫీహెూటల్లు భవనములు ఏ రీతిన ఉండెడివో తెలుసుకొనుటకు అనువగు వర్ణనలుకలవు. ఉత్తర దక్షిణ దేశయాత్రలో అయాక్షేత్రములు, మలబారు పరిస్థితులు, నంబూద్రి బ్రాహ్మణుల వృత్తాంతము, వివిధ నాటకరచనలు, సమాజములు, చిత్రలేఖనము, సంగీతము ఇది అది అననేల వివిధ విషయములను గురించి తెలిసికొనగల హంశములుకలవు. డాక్టరుగారు కేవలము వైద్యవృత్తిలోనేగాక, శిల్పమందు, లలితకళలయందు, సనాతన ధర్మరక్షణయందు వారికిగల నైపుణ్యము ఈ గ్రంథము చదివిన తెలియనగును. మానవసేవయే మాధవసేవ అని డాక్టరుగారి ఆదర్శము. స్త్రీల వ్యాధుల నివారించు ఔషధముల వలన వీరి ధనార్జన ఎక్కువగా జరిగినందున అది గుర్తించి, సంపాదిం

చిన ద్రవ్యము ఎక్కువగా సోదరీమణుల విద్య మొదలుగాగల శ్రేయోదాయక ములగు కార్యములకు వెచ్చచేసిరి. ఈ గ్రంథం చదివిన ఆబాల గోపాలము నేర్చుకోదగిన విషయములు గోచరమవును. అందరు తప్పక చదవవలసిన గ్రంథము.

9-3-53

ప్రత్తిపాటి సత్యనారాయణరావు
మద్రాసు హైకోర్టు జడ్జి

# నివేదన

పూజ్య బాబు కీ. శే. కేసరి గారు వ్యాసములుగా రచించిన 'చిన్ననాటి ముచ్చట్లు'ను ఆంధ్ర ప్రజానీకము 'గృహలక్ష్మి', 'ఆంధ్రజ్యోతి' మాసపత్రిక లలో చదివి శ్లాఘించినది.

ఈ గ్రంథమంతలి చివరనున్న అనుబంధము కీ. శే. కేసరిగారి జీవిత చరిత్రను క్లుప్తముగా తెలుపునట్టిదైన, 1947 సం. మున కేసరి విద్యాలయం వార్షికోత్సవ సందర్భపు వారి స్వంత ఉపన్యాసము. ఈ ఉపన్యాసమును బట్టి తమ వాస్తవిక జీవితచరిత్రను స్వయముగా వివరించుటకుగాను 'ముచ్చట్లు' వ్రాయసమకట్టియుండునను తెలియగలదు.

ఇది కేవలము శ్రీ కేసరిగారి స్వీయచరిత్ర అనిపించుకోక పోయినప్పటి ( నిరుపేదగా ప్రారంభమయిన తమ జీవితమును, ఆత్మబలం, స్వయంకృషి, అచంచలమైన దీక్షలతో మహర్దశపురుషుడుగా రూపొందించుకొనిన వారి జీవ యాత్రకు సంబంధించిన చారిత్రాత్మక సంఘటనలు, అనుభవములు, కష్టసుఖ ములు, భోగభాగ్యములు, దాన ధర్మములు మొదలగునవి ప్రజానీకంలో నవ చైతన్యాన్ని, పురోభివృద్ధిని ప్రోత్సహించగలనని అనేకుల విశ్వాసము ; అదే మా విశ్వాసమును. విషయసేకరణతో విశేషంగా తోడ్పడిన అప్పటి 'గృహలక్ష్మి' సంయుక్త సంపాదకులు శ్రీ రామచంద్రుని వేంకటప్పగారికి కృతజ్ఞులము.

ఈ గ్రంథాన్ని పూజ్య కేసరిబాబుగారియెడల అత్యంత భక్తిశ్రద్ధలతోటి, వారి ఆశయలక్ష్యాలు సిద్ధించుననే నమ్మకంతో మీకందిస్తున్నాము.

ప్రచురణకర్తలు
(ప్రథమ ముద్రణము - 1953)



"How could Ravana, such a learned man, be carried away by the malicious words of Surpanakha? Could't he see her game?" questioned Raghu.

"Ravana was not unaware of the infatuation of Surpanakha to the two princes but he had his own motive and reason for abducting Seeta. Janasthana, his outpost of Dandaka Aranya, was smasted killing fourteen thousand of his army, including Khara and Dooshana. It was to settle scores with the enemy and defend his fort, he followed, of course, an ignoble path," said Raghu's Father.

"Dad, you seem to suggest he was not enamoured of the beauty of Seeta?"

"That was incidental as Surpanakha painted a rosy picture of exquisite charm, grace and all that, but the main objective was to show the enemy his place. And Ravana, in his arrogance of might, stealthily lifted away the enemy's wife which heinous act costed him his life and kingdom. He did not die as a brave warrior but only as a mean culprit," explained Raghu's Father.

*Swadharma Swaarajya Sangha* (*Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*






## 1991 మే 03

శివకామి ఆనందన్, కలైమణి ఫిలిమ్ న్యూస్ ఆనందన్ దంపతుల కుమారుడు చి॥ గుణసాగరమ్ (రవి)కి, బాలసుందరమ్ ముదలియార్ కుమార్తె సౌ॥ శాంతకుమారికి, ఉదయం పదిగంటలకి రాజేశ్వరీ కళ్యాణ మండపంలో వివాహం, పొద్దుట ముహూర్తానికీ, సాయంత్రం రిసెప్షన్‌కీ (శ్రుతిరాగ్ వారి లలిత సంగీతం) మద్రాసు ఫిలిమ్ ఫీల్డ్ అంతా అక్కడే వుంది. నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.... దక్షిణ భారత చిత్ర జగతిలో ఫిలిమ్ న్యూస్ ఆనందన్ అందరికీ కావల్సిన మిత్రుడు ; ఆయన సేకరించినంత సినీ సమాచారం మరింకెవరి వద్దా లేదనడం అతిశయోక్తి కాదు.

## .....05

"పుదూరు అనే గ్రామం నెల్లూరు జిల్లాలో నాయుడుపేట సమీపాన ఉంది. తమిళ ప్రాంతం నుంచి వచ్చి అక్కడ స్థిరపడటం చేత, అక్కడివారు పుదూరు ద్రావిడులయారు. అయితే, పుదూరు ద్రావిడశాఖ నుంచి, తెలుగు వారికి అత్యంత ప్రియమైన ప్రతిభావంతు లనేకులు జనించారు - వావిళ్ల రామస్వామి శాస్త్రి, వేదం వేంకటరాయశాస్త్రి, అల్లాడి కృష్ణస్వామి - యిలా ఎందరెందరో ఉన్నారు. ఆయా రంగాలలో వారు అందుకున్న శిఖరాలు తలుచుకుంటే ఆశ్చర్యంగా ఉంటుంది.... సన్మాన గ్రహీత వెంకటరాయశాస్త్రి తాతకు దగ్గ మనుమడు ; ఆ మహాపండితుని వద్దనుంచి సాహిత్య ప్రేరణ పొందారీయన ; మామగారు నేలటూరి వెంకటరమణయ్యగారు. ఆ ఇద్దరి ప్రభావం ఈయన మీద వుండటం వల్లనే, అధ్యాపకవృత్తి వొదిలేసి జీవితాన్ని సాహిత్యానికి, సాహిత్య ప్రచురణకి అంకితం చేశారు" - అన్నారు, పుదూరు ద్రావిడ అసోసియేషన్‌వారు ఏర్పాటు చేసిన వేదం వేంకటరాయశాస్త్రి అభినందనోత్సవ సభకు అధ్యక్షత వహించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డి, గోఖలె - శాస్త్రి హాలులో జరిగిన ఈ అభినందన సభకు, రాఘవరామశాస్త్రి స్వాగతం తెలుపగా, డి ఆంజనేయులు, కోరాడ మాధవశాస్త్రి, యమ్

నరసింహాచారి, సింగరాజు సచ్చిదా నందమ్, వుడలి నరసింహశాస్త్రి మున్నగువారు ప్రసంగించారు. "నా కిప్పుడు ఈ సన్మానం అనవసరం. సన్నిహితుల మాట తోసి పుచ్చలేక, వొప్పుకోవలసి వచ్చింది. మా తాత గారి కాలంలో ఆయన సాధించిన దానితో పోల్చిచూస్తే నేను చేసినదీ, చేస్తున్నదీ అతిస్వల్పం. సాహిత్య తృష్ణ గలవారికి తెలుసు ఈ తపన ఎలాటిదో !.... మంచి పుస్తకాలు వేస్తున్నానని మాట వరసకి మెచ్చు కుంటారే గాని, గ్రంథాలయ సంస్థలు గాని, ప్రభుత్వ శాఖలు గాని ఏటు వంటి చేయూతా యివ్వవు. పుస్తకాలు అచ్చు వేయడమనేది ఏటికి ఎదురీద డం లాటిది. అయినప్పటికీ ఈదు తున్నాను" అన్నారు వేదం వేంకట రాయశాస్త్రి, తనపై కురిపించిన ప్రశంసలకు సమాధానంగా.... మంచి పుస్తకాలు అచ్చువేసే వారికి, లంచాలు పెట్టే విద్య తెలియదు గనుక, అవి గ్రంథాలయ గుమ్మం ఎక్కవు. 'ఆపరేషన్ బ్లాక్‌బోర్డు' పేరిట వేలూ లక్షలూ ఎలా దుర్ వ్యయమైనదీ వింటూంటే, 'అవినీతీ, నీ అంతు ఎక్కడ ?' అని అనిపించకమానదు.... వేదం వేంకటరాయ శాస్త్రి వంటి వారిది ఒక నిరంతర సాహిత్య యాత్ర ; ఓటమి నెరుగని వెన్నెలబాట అది ; ఆ సాహితీ శరశ్చంద్రికలు తెలుగు సరస్వతి శిరీష కుసుమాలు.

## 06

లలిత సంగీతం మనసుని రంజింప జేస్తుంది. కాని, క్లాసికల్ మ్యూజిక్ హృద్వీణపై పలుకుతుంది. గత అయిదు సంవత్సరాలుగా శాస్త్రీయ సంగీతం పట్ల ఆదరణ, అభిరుచి, అభిమానం పెంపొందించేందుకు కృషి చేస్తున్న శర్వాణీ సంగీత సభ వారు, కస్తూరీ హాలులో (మినీ మ్యూ జిక్ అకాడమీ) శంకర నారాయణన్ పాట కచ్చేరీ ఏర్పాటు చేశారు. ముఖ్యంగా ఔత్సాహికులకు అవకాశ మివ్వడం ఈ సభవారి ధ్యేయం. సంగీత జ్ఞానంతో బాటు రసజ్ఞులను మెప్పించ గల బాణీ తెలుసు శంకర నారాయణన్‌కి.

## ..... 14

ఏప్రిల్ 22, పృధ్వీదినంగా పరి గణిస్తారు. అంటే ఈ భూమిని, ఈ పర్యావరణాన్ని ఎంత పరిశుభ్రంగా వుంచడానికి వీలవుతుంతో అంత పరి శుద్ధంగా వుంచమనే హెచ్చరిక. స్వార్ధ పరుడైన మానవుడు, ప్రకృతి వనరు లని అన్నివిధాలా కలుషితం చేస్తూ, భారీ పరిశ్రమల పేరిట వంకర దారులు తొక్కుతున్నాడు. ఆధునిక ప్రపంచంలో కార్పొరేట్ సంస్థలకు, న్యాయ సంరక్షణ శాఖలకు ప్రచ్ఛన్న యుద్ధం అనవరతం సాగుతోంది. ఒకరికి అధికలాభాలు కావాలి ; మరొకరికి ప్రజారోగ్య పరిరక్షణ కావాలి. ఈ సంఘర్షణ కనుమూపు

మేరలో చల్లారదు. ప్రతి దేశమూ ప్రతి ప్రాంతమూ చైతన్యవంతమగు ప్రజాభిప్రాయ బలంతో దీనిని ఎదుర్కోక తప్పదు. అమెరికన్ ప్రజాభిప్రాయం ఈ జటిల సమస్యను ఏవిధంగా ఢీకొంటున్నదీ, యివ్వాళ అమెరికన్ సెంటర్లో ఆహూతులకు చూపిన డాక్యుమెంటరీలోని ప్రధానాంశం. ముఖ్యంగా ప్లాస్టిక్స్‌నీ ప్లాస్టిక్ సరుకులనీ ఏం చేయాలో బోధపడటం లేదట. రసాయన ఎరువులవల్ల తాత్కాలిక ప్రయోజనమే గాని, ఆర్థిక పరంగా అవి నష్టదాయకమనీ, సారం పీల్చేసి సేద్యపు నేలని నిరుపయోగం చేస్తాయనీ అంటున్నారు.

. . . . . 19

"'తాత మనవడు' కాలం నుంచీ బాలూ నాకు సన్నిహితుడు. పాతికేళ్లగా విజయ పథంలో పయనిస్తున్న నటగాయకుడు బాలసుబ్రహ్మణ్యం. ప్రోత్సహించడమే ధ్యేయంగా గల స్నేహశీలి.... తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ ఈ రజతోత్సవం జరపడం ఎంతో సముచితంగా ఉంది. మిగతా భాషలలో కంటె తెలుగులో







పరిశ్రమకు, పత్రికలకు పరస్పర మైత్రి భావం గాఢంగా వుంది," - అన్నారు, దాసరి నారాయణరావు, తెలుగు ఫిలిమ్ జర్నలిస్టులు, హోటల్ సవేరాలో జరిపిన, బాల సుబ్రహ్మణ్యం రజతోత్సవ సభలో. "ఎన్నో జన్మలు ఈశ్వరుణ్ణి సేవిస్తే గాని సుగాత్రుడు కాలేడంటారు; బాలూ కంఠం ఒక వరప్రసాదం" - అన్నారు జంధ్యాల. "నేను ధరించే పాత్రలకు సంగీత పుష్టి, రసపోషణ కలిగిస్తున్నారు బాలూ" - అని మెచ్చుకొన్నారు హీరో చిరంజీవి. దర్శకులు విశ్వనాథ్, ఈ సినీ ఫీల్డ్‌లో మొదటి ఛాన్స్ యిచ్చిన 'రేఖా అండ్ మురళి' పద్మనాభం, యస్పిని ఆశీర్వదించారు. అలాగే రాజేశ్వరరావు కూడా .... "నాకు సంగీత జ్ఞానం లేదు; సరిగమలు నేర్చుకోలేదు.... మా నాన్నగారు హరికథలు చెబుతుండేవారు - మాది పెద్ద కుటుంబం.... నన్ను ఇంజనీర్ చేయాలని మా నాన్నగారి సంకల్పం .... సింహపురి కళా సమితి నిర్వహించిన జాత్సాహిక సంగీత పోటీలో యస్. జానకిగారు నాకు ప్రథమ బహుమతి యివ్వడంతో, ఈ సంగీత పిపాస యింకొంచెం పెరిగింది. 1963 లో మద్రాసు సోషల్ అండ్ కల్చరల్ క్లబ్‌వారు నిర్వహించిన లలిత సంగీత పోటీలో పాల్గొని బహుమతి అందుకున్నాను. కోదండపాణిగారు నన్ను అప్పట్లో ఎందరికో పరిచయం చేశారు. కాని, ఏ ఒక్కరూ నాకు ఛాన్సు యివ్వలేదు. కోదండపాణిగారికి నా భవిష్యత్తు పట్ల ఎంతో నమ్మకం. కాని, నాకు నామీద నమ్మకం లేక, పరిస్థితి డోలాయమానంగా ఉండేది. అప్పట్లో ఘంటసాల గారు మకుటంలేని మహారాజు.... కోదండపాణి గారి మాట కాదనలేక, పద్మనాభం గారు నాకు వారి కంపెనీలో నెలకు మూడువందల జీతం మీద ఉద్యోగం యిచ్చారు. 'రావే కావ్య సుమబాలా - జవరాలా' అనాటిదే. 1966 డిసెంబరు 16వ తేదీన ఈ ప్లేబాక్ ప్రపంచంలో ప్రవేశించాను. ఇప్పుడు తెరవెనకే కాదు, తెరమీద కూడా అప్పుడప్పుడు కనిపిస్తున్నాను. నా గురించి మొట్టమొదట వ్రాసిన జర్నలిస్ట్ ఆంధ్రప్రభ వెంకట్ .... విశ్వనాథ్‌గారు 'శంకరాభరణం' తీస్తూ, నన్ను పాడమంటే నాకు భయమేసింది. 'నేను కాదండీ, బాలమురళిగారో జేసుదాసుగారో పాడాలి'. అన్నాను. అయితే, విశ్వనాథ్‌గారు నామాట ఖాతరు చేయక, పట్టుబట్టారు. వారు గీసిన గీటు దాటే శక్తి నాకు లేదు. భయపడుతూనే, వొప్పుకున్నాను.... అమెరికాలో కానీయండి, ఇంగ్లండులో కానీయండి, ఎక్కడ ఏ దేశంలో పాట కచ్చేరీ చేసినా, 'శంకరాభరణం'లోని పాట పాడనిదే వొదిలిపెట్టరు. అది వేరే విషయం - నా సుకృతమూ, పూర్వ పుణ్యఫలమూ కావచ్చు. కాలం ఆగనట్లే ఈ సినీ రంగం ఎవరికోసమూ ఆగదు; కొత్తవారు వస్తూంటారు, కొత్తబాటవేస్తూ వుంటారు. అప్పుడే పాతికేళ్లు

అయిందా అనిపిస్తున్నప్పటికీ, మొల తాడు కట్టినప్పట్నుంచీ వున్న స్నేహితులే, నాకు అండగా నిలబడి వున్నారు. ఈ కాన్ఫరెన్స్ హాలులో ఏళ్ల తరబడి తెలిసిన ముఖాలూ, నిండుమనసుతో నా శ్రేయస్సు కోరుతూ వేసిన అభినందన సుమమాల, జన్మ నిచ్చిన మాతృమూర్తి, జీవితం పంచు కుంటున్న సహచారిణి సమక్షంలో జరిగిన ఈ అద్వితీయ వేడుక, ఆనంద బాష్పాలతో నన్ను పరవశింప జేస్తోంది'' - అన్నారు యస్పి బాలసుబ్రహ్మణ్యం. వందా, వందా ఏభైకి మించని ఈ సమావేశం 'గంగిగోవు పాలు గరిటెడైనను చాలు' - అన్న సామెత మాదిరిది. 'బృహస్పతికైనా, వాచస్పతికైనా, పదాలన్నీ సప్తస్వరాలు, నడుస్తున్న పాట, నవ్వుతున్న పాట' అని ఎవరో అన్నారు. అంతేకాదు, నవరసాలూ పలికించే సప్తస్వర పేటిక బాలూ పాట.

## 29

దూరప్రాచ్యంలో 55రోజులపాటు తన నాట్య బృందంతో పర్యటించిన మార్తా గ్రాహమ్, (Martha Graham) డిసెంబరులో అస్వస్థురాలైంది; రెండు నెలలపాటు న్యుమోనియాకు మందిచ్చారు; కోలుకుంటున్నట్టు కనిపించినప్పటికీ, మగ్గిన పండు రాలడం ఎంత స్వభావ సిద్ధమో, అదేవిధంగా, 1991 ఏప్రిల్ ఒకటోతేదిన, న్యూయార్క్ మాన్‌హట్టాన్‌లోని స్వగృహంలో 96వ ఏట కన్ను మూసింది. ప్రపంచ చిత్రలేఖనంలో పాబ్లో పికాసొది ఎటువంటి

స్థానమో, నాట్యలోకాన మార్తా గ్రాహమ్‌ది అటువంటి స్థానం. సుధారాణి రఘుపతి 1965 లో స్కాలర్‌షిప్ మీద అమెరికా వెళ్ళినప్పుడు, మార్తా గ్రాహమ్ విద్యాలయంలో కొన్నాళ్ళపాటు శిక్షణ పొందారు. చంద్రలేఖ ముప్ఫయ్యేళ్ళ క్రితం మార్తాని కెన్నమెరాలో కలుసుకు, ఆమె విజ్ఞతకు ముగ్ధురాలయారు. మద్రాసుకి చెందిన ఈ యిరువురు ప్రఖ్యాత నర్తకీమణులు, మార్తా గ్రాహమ్‌కి తమ గౌరవనివాళి సమర్పించారు అమెరికన్ సెంటరులో. (మార్తా గ్రాహమ్ గురించి తెలుసుకోదలుచుకున్నవార్ధు మేనెల 'స్పాన్' చూడండి - Death of a Legend

'ఆమె చెబుతున్నది వినడమే తప్ప, ప్రశ్నలడగగల ధైర్యంలేదు నాకు అప్పట్లో - ముప్ఫయేళ్లనాటి మాట. మనోభావాలన్నింటిని, కర చరణ విన్యాసజనితమగు కదలికలో చూపడం ఆమె ప్రత్యేకత. దేహం విల్లంబులా వొంగాలి. కాళ్లూ, చేతులూ, చేతివేళ్లూ, నడుమూ సమస్తం మైనపు ముద్దలా మారిపోవాలి. ప్రాచీన కావ్యపాత్రలు ఆమె 'కొరియోగ్రఫీ' లో ప్రాణం పోసుకు, ప్రేక్షకులని పౌరాణిక సంధ్యలోకి పట్టుకుపోతాయి. పాతవన్నీ చించేసి, తెరలన్నీ తొలగించి, ఆమె చూబుతున్నప్పుడు, కొంచెం షాకింగ్‌గా ఉండవచ్చు. కాని, దేనికీ భయపడక, తన నమ్మిన ప్రమాణాలు వొప్పించే కళాతపస్విని ఆమె'' - అన్నారు చంద్రలేఖ....

''మార్తా గ్రాహమ్ యోగవిద్య నేర్చుకొంది; యోగాసనాల ద్వారా, ప్రాణాయామం ద్వారా శరీరాన్ని శాసించగల శక్తి అలవరుచుకొంది. పృష్ఠ భాగముపై నర్తకి ఆధిపత్యాన్ని కలిగివుండటం గ్రాహమ్ టెక్నిక్‌లో ప్రధానమైనది. అచ్ఛాదనా రహిత భావన, భారతీయ మనసత్వానికి, సంప్రదాయానికి విరుద్ధమైనది. ఆ భావనకు పోటీయనవసరం లేకుండా, ఆమె నాట్యరీతులూ శిల్పమూ నేర్చుకున్నాను'' - అంటూ సుధారాణి రఘుపతి, గ్రాహమ్ టెక్నిక్ ఏ తీరున వుండేదీ స్టేజి మీద చూపారు. ఆ తర్వాత, మార్తాగ్రాహమ్, ఆమె స్కూలు, ఆమె అభిప్రాయాలు, ఆమె శిల్పంలోని ప్రత్యేకత - యిలాంటివి వివరిస్తూ ఒక గంట మూవీ.... 'ఆ, నేను రాను' అనే మాలతి, యివ్వాళ వచ్చింది. ముప్ఫయ్యేళ్ళ క్రితం మార్తా గ్రాహమ్ పెర్‌ఫారమెన్స్ చూశాము. అప్పట్లో ఆమె బొమ్మవేసి, నాలుగు ముక్కలు రాశాను కూడా ఈ చిన్న పత్రికలో. మార్తా గ్రాహమ్ డాన్స్ చూడటం, రాజాజీ హాలులో హెలెన్ కెల్లర్ని దగ్గిర్నుంచి చూడటం - యివి మరుపురాని మరువలేని మహదానుభూతులు మా జీవితాలలో.

## 1991 జూన్ 02

తమిళ సాహిత్యకార్ అశోక మిత్రన్. రాజేశ్వరీ దంపతుల కుమారుడు చి॥ రవిశంకర్‌కీ (గౌహాతీలో ఉద్యోగం), ఇండియన్ రైల్వేస్‌లో

ఎలక్ట్రికల్ ఇంజనీర్ వెంకట్రామన్ కుమార్తె సౌ॥ ఉమకు ఈ ఉదయం ఏడుంపావుకి మీనాక్షి కళ్యాణమండపంలో వేదోక్త విధులతో వివాహం. నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.... పది గంటలకు మహాలింగపురంలో, కవయిత్రి ప్రతికా రచయిత్రి సౌ॥ పాటిబండ్ల విజయలక్ష్మికి, చి॥ శిరీష్‌కుమార్‌కి శాస్త్రోక్తంగా వివాహం. ఊర్వశి శారద, దాసరి పద్మ, నిర్మాతలు గోపాలరెడ్డి. ఏడిద నాగేశ్వర్రావు వంటివారు భాక్షితలు చల్లారు. నవ దంపతులకు మాలతీ - చందూర్‌ల శుభాకాంక్షలు.... యశోదా - దొరైస్వామి పొద్దుట ముహూర్తానికి రాలేదేమని నిలవదీస్తారు - మాకు తెలుసు. యశోద, చిల్డ్రన్స్‌గార్డెన్ స్కూలులో, శారదాంబ స్టూడెంటు; ఇప్పుడు స్టెల్లా మేరీస్‌లో ప్రొఫెసరు. వారి అబ్బాయి బొంబాయిలో మంచి ఉద్యోగంలో ఉన్నాడు. ఈ ఉదయం పదిన్నరకి వుడ్‌లాండ్స్‌లో చి॥ భరత్‌కి, సౌ॥ జయశ్రీకి వివాహం జరిగింది. సాయంత్రం రిసెప్షన్. కొత్త జంటకు మా శుభాశీస్సులు .... కల్యాకం

(యశోద చెల్లెలు), జగదీష్ చంద్ర (ఆర్డనెన్స్ ఫాక్టరీలో ఉన్నతోద్యోగి) ఉదయం మా గురించి అడిగారట. కనిపించాక, యిక ఒకటే కబుర్లు. .... మీరిద్దరూ కలకత్తా ఎప్పుడు వస్తున్నారని అడిగారు జగదీశ్ చంద్ర. తేదీ నిర్ణయించవలసినది శివస్వామిగారు - అని చెప్పాను. కొచ్చిన్ తీసుకువెళ్లినట్టే, కలకత్తాకు రప్పించక మానరు శివస్వామి దంపతులు.

..... 03

"సినిమాలు, టెలివిజను, పేరు ప్రఖ్యాతులూ సంపదా తెచ్చిపెట్టినా, నాకిప్పటికీ నాటక రంగమంటేనే యిష్టం. రంగస్థలం కళాకారునికి మానసికానందాన్నీ తృప్తినీ యిస్తుంది. 'కట్' అనే వారెవరూ ఉండరు. ఎదురుగా కూచున్న ప్రేక్షకులనుంచి నిత్య నూతనోత్సాహం పొందగలుగుతాము" - అంటాడు జాసన్ నెల్సన్ రొబార్డ్స్. అతని తండ్రి హాలీవుడ్ యాక్టర్. ఒక నాటక ప్రదర్శనలో తండ్రి పబ్లిషర్‌గాను, కొడుకు రచయితగాను కూడా వేశారు (The Disenchanted) .... రెండవ ప్రపంచయుద్ధ కాలంలో నౌకాదళంలో చేరిన జాసన్ రొబార్డ్స్, ఒకనాడు ఓడలోని లైబ్రరీలోవున్న ఓనీల్ 'స్ట్రేంజ్ ఇంటర్లూడ్' (Strange Interlude) చదవడంతో, అతని జీవిత మార్గం మారిపోయింది. 1946 లో నౌకాదళంనుంచి విడుదల కాగానే, డ్రామా స్కూలులో జాయినై, ఎనిమిది నెలలపాటు శిక్షణ పొంది, రంగస్థలం మీద వివిధ పాత్రలు ధరిస్తూ, 1956 నాటి 'ది ఐస్‌మాన్ కమెత్' - ఓనీల్ నాటకంతో - విమర్శకుల దృష్టిలోపడి, ప్రశంసలందుకున్నాడు. కూలినగోడలూ పగిలిన స్వప్నాలూ లేకుండా ఏ మనిషీ వుండడు - అనేది, ఆ నాటకంలోని యితివృత్తం. జాసన్ రొబార్డ్స్‌కి 'ఓనీల్' అంటే అపరిమితమైన అభిమానమూ గౌరవమూను. 'లాంగ్ డేస్ జర్నీ ఇంటు నైట్' (Long Day's Journey into Night) - అదీ ఓనీల్ దే - రొబార్డ్స్‌కి అవార్డ్ తెచ్చిపెట్టింది. నటించిన సినిమాలన్నీ ఒక ప్రత్యేక పంథాకు చెందినవి. ఎర్నెస్ట్ హెమింగ్వే రాసిన 'ఫర్ హూమ్ ది బెల్ టాల్స్' (For Whom The Bell Tolls) టెలివిజన్ వెర్షన్‌లో జాసన్ రొబార్డ్స్ చూపిన నటనా సామర్థ్యం అనుపమాన మంటారు. అమెరికన్ సెంటర్‌వారు జాసన్ రొబార్డ్స్ ఫిలిమ్ ఫెస్టివల్‌లో అయిదు చిత్రాలు చూపుతున్నారు. ఇవ్వాళ ప్రదర్శిస్తున్నది 'నిశాకాంత ఎంత మృదులం!' (Tender is the Night)....స్కాట్ ఫిట్జ్ రాల్డ్ నవలకు వెండితెర రూపమిది. ఈ శతాబ్ది ఇరవైలలో అనే అమెరికన్ డాక్టరు - ప్రఖ్యాత మనస్తత్వవేత్త - నికొలి అనే భాగ్యవంతురాలికి వైద్యం చేస్తూ, ప్రేమలో పడతాడు. జ్యూరిచ్‌లోని యితని గురువు - పేషంటూ, ప్రేమా పరస్పర వ్యతిరేకమని మర్చిపోకు - అని హెచ్చరిస్తాడు. అయినప్పటికీ ప్రేమ

వాహినిలో పడ్డ డిక్, ఐశ్వర్యవంతురాలైన నికొలిని పెళ్లాడి యిద్దరు పిల్లలకు తండ్రి అయి, ఫ్రెంచి రివీరాలో పార్టీలూ, ప్లేయింగూ, ప్లెజర్సూ మధ్య అశాంతిలోనై 'ఏమిటీ జీవితం? ఎందుకు బతుకుతున్నట్లు ?' అనే అంతర్ మథనానికి లోనవుతాడు. రోజ్ మేరీ అనే హాలీవుడ్ తార అటు వైపుగా వచ్చి, డిక్ పట్ల కొంచెం ఆసక్తి చూపడంతో నికొలిలోని అసూయ పెల్లుబుకుతుంది. నికొలికి కావల్సింది విలాసమయ జీవితం; డిక్‌కి కావల్సింది చేతినిండా పని. ఒక కామన్ ఫ్రెండ్ వీరిద్దరి మధ్య నిలబడి, ఎవరి దారిని వారు పయనించేటట్టు, నేర్పుగా నాజూకుగా విడదీస్తాడు. జాన్ రొబార్ట్స్ డిక్‌గా, జెనిఫర్‌జోన్స్ నికొలిగా, జోన్ ఫాంటైన నికొలి సోదరి బేబీగా నటించిన ఈ 146 ని॥ల చిత్రానికి దర్శకులు హెన్రీ కింగ్.

## 04

మణిగారి అమ్మాయిలు మాధవీ, సుందరి కస్తూరి హాలులో (మినీ మ్యూజిక్ అకాడమీ), శర్వాణీ సంగీత సభవారు (సెక్రటరీ: యస్ వసంత) ఏర్పాటు చేసిన ప్రోగ్రామ్‌లో అన్నమయ్య కీర్తనలు గానం చేశారు. పాడుతున్న యిద్దరికీ యిది మొదటసారి కావడం వల్ల, ప్రారంభంలో కాస్త స్టిఫ్‌గా కనిపించినా తర్వాత దారిలో పడ్డారు. అయితే వాద్య బృందం అధికమై, వారు ధారాళంగా పాడటానికి కొంతమేర అవరోధమయింది. అన్నమయ్య పదాలెప్పుడూ సంగీత సాహిత్య చిత్ర సముచ్చయం : మనోవీధిని చిత్రమాలిక అల్లడమే ఆ సంకీర్తనలలోని గొప్పతనం. మాధవీ, సుందరీ - యిద్దరూ చక్కగా శ్రావ్యంగా పాడారు.

. . . . . 05

'వాషింగ్టన్ పోస్ట్' లోని కార్ల్ బెర్న్ స్టిన్, బాబ్ వుడ్‌వర్ల్‌ల కారణంగా, ఆ పత్రికా రచయితలు వెలికి తీసిన కూపీల ఫలితంగా, 'బగ్గింగ్' నేరానికి గాను నిక్సన్ అంతటివాడు అమెరికన్ అధ్యక్ష పదవి నుంచి రాజీనామా చేయవలసి వచ్చింది. నిజం నిప్పు లాంటిది; కాలుతుందని తెలుసు; కాని, కాగితంతో పొట్లం కట్టగల మని అనుకుంటారు. అధికార స్థానా లలో వున్నవారు, తమ తప్పుడు పనులు కప్పిపుచ్చుకొనేందుకు, ప్రతి కల నోరు మూదామనుకుంటారు; కొంతవరకూ కృతకృత్యులవుతారు; కాని, చివరంటా అది సాధ్యంకాదు. 'వాషింగ్టన్ పోస్ట్' పై కేసు బనాయిం చారు; జుల్మానా విధించారు; పరి శోధన చేస్తున్న యిరువురు జర్న లిస్టులనీ సఫా చేదామనుకున్నారు. దగుల్బాజీ పనులని నడిరోడ్డు మీదకి లాగడంలో వెనుకంజ నెరుగని ఎడిటర్ (జాసన్ రొబార్డ్స్) తన విలేఖరులకు అండగా నిలబడుతాడు - వాటర్‌గేట్ స్కాండల్ బట్టబయలు అవుతుంది. సిగ్గుతో తలవాల్చుకు అధ్యక్షస్థానం నుంచి తప్పుకుంటాడు నిక్సన్. ఇద్దరు పత్రికా రచయితల స్వానుభవమూ యదార్థగాథ అయిన 'అధ్యక్షుని చుట్టూ వున్న అందరూ' (All the President's Men) పుస్తకంగా, ఫిలిమ్‌గా బహు జనాదరణ పొందింది. 136 ని॥ల ఈ చిత్రానికి దర్శకులు : యలాన్ పాకులా .... జూలియా, లాంగ్ డేస్ జర్నీ ఇంటు నైట్, ఎ థవుజెండ్ క్లవున్స్ (Julie - 1977; Long Day's Journey Into Night - 1962; A Thousand Clowns - 1965) ఈ మూడూ చూదామనుకుం టూనే చూడలేకపోయాను.

. . . . . 08

వెంపటి చినసత్యం (కూచిపూడి ఆర్ట్ అకాడమీ), స్వరాజ్యలక్ష్మి దంపతుల కుమారుడు చి॥ వెంకట చల పతికి, అడ్వకేట్ నారాయణస్వామి దంపతులు కుమార్తె సౌ॥ శైలజకు, ఈ ఉదయం ఒంటిగంటవేళ విజయ రాణీమహల్‌లో వేదోక్తంగా వివాహం జరిగింది. సాయింత్రం రిసెప్షన్‌లో కల్పకం స్వామినాథన్ వీణ కచ్చేరీ. పద్మా సుబ్రహ్మణ్యం, వీరప్పన్, టి టి వాసు మున్నగువారెందరో నూతన వధూవరులకు శుభాశీస్సులు తెలిపారు. నవ దంపతులకు మా శుభాభినంద నలు.

. . . . . 09

సురేంద్రన్ (డిప్యూటీ ఛీఫ్ ఆఫీ సరు : ఆంధ్రాబ్యాంక్), సరోజా దంప తుల కుమార్తె సౌ॥ అనితకు, కల్వే సాంబశివమ్ దంపతుల కుమారుడు చి॥ సతీష్‌కు, ఈ ఉదయం పదిన్నరకు రాఘవేంద్ర మండపంలో సంప్రదాయ సిద్ధంగా వివాహం జరిగింది. నూతన దంపతులకు మా శుభాకాంక్షలు .... నాలుగు నెలలనుంచి ఉన్నికృష్ణన్

పాట వినాలని! మధ్యాహ్నం డా॥ రాధాకృష్ణన్ ఫోను చేసి చెప్పడం వల్ల, మైలాపూర్ ఫైన్ ఆర్ట్స్‌లో ఈ యువకుని సంగీత కచ్చేరి వుందని తెలిసింది .... వివేకానందా నుంచి కామర్స్‌లో గ్రాడ్యుయేషన్ అయాక, శ్రీరామ్ గ్రూప్‌లో పని చేస్తూ, 'లా' చదువుతున్నాడీ యువకుడు. క్రికెట్‌లో వికెట్‌కీపరూ బాట్స్‌మానేగాక, శాస్త్రీయ సంగీతంలో, తలిదండ్రులని, బంధు మిత్రులని, రసికలోకాన్ని ఆనందపరిచేటంత విద్యుత్ సంపాదించాడు. తొమ్మిదో ఏట గాత్ర సంగీత, ప్రారంభించి, శేషాద్రి మేస్టారి వద్ద కొంతకాలం నేర్చుకు, ఆ తర్వాత కీ. శే. రామనాథన్‌కి శిష్యుడయాడు. ఇప్పుడు సావిత్రీ సత్యమూర్తి వద్ద నేర్చుకుంటున్నాడు. ఎంతో కాలంగా పాట కచ్చేరీలు చేస్తూ సంగీత ప్రియులని మెప్పిస్తున్న ఉన్నికృష్ణన్, యివ్వాళ రెండున్నర గంటలసేపు శ్రోతలను కుర్చీలకు కట్టేశాడు. ఒక్కరు కుర్చీలో నుంచి కదల్లేదంటే, ఆ గాన సుధారసం, వింటున్నవారిని ఎలా తన్మయులు గావించిందో ఊహించుకోవచ్చు. అడమోడిగలదే.... తొలి నేను జేసిన.... నెనరుంచినాను .... ఏటి యోచనలు .... వంటివి శ్రోతలను అలౌకిక ప్రపంచాన విహరింపజేశాయి. సువర్ణ భవిష్యత్తులోకి చూస్తున్న ఈ యువకునిలో మహా విద్వాంసుడు కాగల లక్షణాలు వున్నాయి.

..... 11

విశ్వశాంతి యు. విశ్వేశ్వరరావు, ఝాన్సీ దంపతుల ఏకైక తనయుడు చి॥ ధనంజయ మురళీకృష్ణకు, కొల్లి బాపయ్య చౌదరి దంపతుల రెండో అమ్మాయి సౌ॥ సత్యకు, మే నెల

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్,' నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము. చందా 24 సంచికలకు : ఏభైఅయిదు రూపాయిలు.

JAGATI, 2, Kutchery Road, PB 2922, Mylapore, Madras-600 004.

ముప్ఫయ్యో తేదీన, గుంటూరులో వివాహం జరిగింది. ఇవ్వాళ వుడ్‌లాండ్స్‌లో రిసెప్షన్. అబ్బాయి ఇంజనీరు (అమెరికాలో), అమ్మాయి ఛార్టర్డ్ అకవుంటెంట్. విద్యాధికులైన ఈ నవ దంపతులకు మా మనఃపూర్వక శుభాకాంక్షలు.

..... 14

మాంబళంలోని వెంకటనారాయణా రోడ్, ఒక నాటి మద్రాసు సిటీ కార్పొరేషన్ కమీషనర్ జె వెంకటనారాయణ గౌరవార్థం, ఆ పేరుని సంతరించుకొంది. ఆయన కుమారుడు సచ్చిదానందరావు కూడా కార్పొరేషన్ కమీషనరుగా పనిచేసి రిటైరయారు. సచ్చిదానందరావు సోదరుడు, వెంకటనారాయణగారి కుమారుడు అయిన కరుణాకరరావు (భారత రైల్వేల నుంచి రిటైరయారు) కుమార్తె (జెవికె రావు దంపతుల మూడో అమ్మాయి) సౌ॥ ఉషకు, బెంగుళూరు వాస్తవ్యులైన సుశీలా వేణుగోపాలరావు దంపతుల కుమారుడు చి॥ హరిమోహన్‌కి ఈ ఉదయం పదిగంటలకు హోటల్ కాంచీలో వివాహం. శుభాక్షితలు వేయగానే భోజనాలకి రండి - అని పిలుపు ..... నవదంపతులకు మా శుభాభినందనలు.... ఈ నెల రెండు, ఎనిమిది, తొమ్మిది, పదకొండు, పద్నాలుగు - వరసని పెళ్లి భోజనాలు.

—యన్నార్ చందూర్

## సమీక్షలు

## చిత్రజగతి

### స్వేచ్ఛా ఫిలిమ్స్ 'భద్రం కొడుకో'

పట్నంలోని మారుమూల హోటల్లో టేబుల్స్ తుడిచి కప్పులూ గ్లాసులూ తీసే బాల కిన్నర్, ఆ కప్పులూ గ్లాసులూ నీళ్ల తొట్టిలో కడుగుతూ కాఫీ తాగినంత తేలికగా హెడ్ సర్వరుకి తన శరీరం వొప్పగించే పనిమనిషికి ప్రథమ సంతానమైన అమాయిక బాలిక, ఈ హోటల్‌కి చేరువలోవున్న స్కూటర్ రిపేరుషాపు యజమాని అడుగుకి మడుగులొత్తే బాల మెకానిక్ - పది పన్నెండేళ్లలోపు నున్న ఈ ముగ్గురూ ఒక జట్టు. వీరికి ఇల్లులేదు, ఇల్లు యిచ్చే రక్షణలేదు, 'నా వాళ్లు' అనే మనుషులు లేరు. ఆదరణ, ఆప్యాయత, అనురాగం - యిలాటివి వారు ఎరుగరు. సర్వ సహజ మానవతా బంధాలకోసం వారు అలమటిస్తున్నారు - కరువువాచి వున్నారు. కాస్త తిండి పడేసి, పైన పెత్తనం సాగిస్తూ, అడుక్కోవడం, జేబు దొంగతనం, చెయివాటితనంలాటివి పిల్లలకు నేర్పే దాదా ముఠా వుచ్చులో పడకుండా, ఈ ముగ్గురూ తమనితాము స్నేహవాత్సల్యంతో కాపాడుకుంటూ వుంటారు. చివరకి అమాయిక బాలిక ఆడపిల్లల్ని అపహరించి దూర ప్రాంతాల అమ్మేవారి వలలో పడుతుంది బాల కిన్నరూ. బాల మెకానికూ ఏమీ చేయలేని నిస్పృహకు లోనవుతారు. మతిలేని పిచ్చిది కామాంధుని అత్యాచారానికి గురికాగా సంభవించిన శిశుజననం. ఆ శిశుజనన సమయంలో తాడూ బొంగరం లేని ఈ బాల బాలికల సహాయ సహకారాలూ ఎంతో సింబాలిక్‌గా ఉన్నాయి. ఓల్గా రాసిన వెన్నెల బాలానందలోకాన వెలుగు రేఖ ; సమాజాన్ని నిద్రమత్తు నుంచి లేపే చైతన్యగీతిక. అక్కినేని కుటుంబరావు ఆరేళ్ల కలకు, మధు అంబట్ కెమెరా రూపురేఖలనీ, కొత్త తళుకునీ యిచ్చింది. స్టూడియో, లాబ్, షూటింగ్, ఎడిటింగ్ యిలాటివి ఏమాత్రమూ తెలియని దర్శకులు అక్కినేని కుటుంబరావు, యిటువంటి సంచలనాత్మక చిత్రం తీయడం నమ్మలేని నిజం.

### శ్యామ్‌ప్రసాద్ 'గ్యాంగ్ లీడర్'

కుటుంబంలో ముగ్గురు అన్నదమ్ములు. మధ్యముడు రాముకి

(చిరంజీవి) స్నేహితులని వెంటేసుకు తిరగటం సరదా. అక్రమాలు జరిపే పోలీసులని ఎదిరించే స్వభావం. తన పరిధిలో సంఘక్షేమానికి, న్యాయరక్షణకు పోరాడుతూంటాడు. ఒక కుమారి (విజయశాంతి) చేత, ఆ వాటా ఖాళీ చేయించేందుకు, ఇంటి యజమాని వద్దనుంచి కొంత పైకం పుచ్చుకొని (తనకోసం కాదు, స్నేహితులకోసం) ఆ పని పూర్తి చేయిస్తాడు. అయితే, కుమారి తిన్నగా తమ యింటికే వచ్చి, తల్లి వెనక నక్కి, ఆశ్రయం కోరుతుంది. ఆడపిల్లకు రక్షణ యివ్వడం ఉత్తమ కుటుంబీకుల కర్తవ్యం గనక, తల్లి, అన్నగారు (మురళీ మోహన్), వదిన గారు, కొత్తగా యింట్లో దూరిన అమ్మాయి పక్షమే పలుకుతారు. ఐ ఎ యస్ చదువుతున్న తమ్మునికి డబ్బు పంపాలి గనక, అన్నగారివద్ద డబ్బులేదు గనక, తమ్ముడు కలెక్టరయేందుకు, హీరోగారు ఒక దుష్కార్యం చేయవలసివస్తుంది. ఒక మర్డర్, యాదృచ్ఛికంగా అన్నగారి కంట పడటంవల్ల, ప్రత్యేక సాక్ష్యం నిర్మూలించేందుకు, సంఘ విద్రోహులు అతనిని హత్యగావిస్తారు. ఐ ఎ యస్ ట్రయినింగ్ అయిన వెంటనే అదే ఊరికి కలెక్టరుగా వస్తాడు తమ్ముడు. విద్రోహులతో చేతులు కలిపిన పోలీసు సూపరెంటు తన కూతుర్ని (సుమలత) కలెక్టరుకిచ్చి పెళ్లి చేస్తాడు - గ్యాంగ్ లీడరు నోరు కట్టేసి! కలెక్టరు బంగళాకి ఈ కుటుంబం మారడం, వదినగారి మీద.అపవాదు, సీతాదేవిని శంకించని లక్ష్మణుడనని హీరో చెప్పుకోవడం డ్యుయట్లుపాడే కుమారి, గ్యాంగ్‌లీడర్ కుడిభుజమవడం, భయానకదృశ్యాలూ వీరోచిత కార్యాలూ తర్వాత కథాంత మవుతుంది. మెగాస్టార్ చిరంజీవి చుట్టూ అల్లిన కృతక సన్నివేశాలతో మాంఛి బిగువుతో ప్రేక్షకులని అలరించే చిత్రం. దర్శకత్వం : విజయ బాపినీడు.

# సినిమా పేరు ?

**కాలం మారుతుంది - చేసినగాయాలు మాన్పుతుంది**
**విడదీసి ముడివేసి వింతాట లాడుతూ**

*గేయరచన : ఆత్రేయ.... పాడినవారు : ఘంటసాల*

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లు వేసి, మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : 20-7-1991

స్వాతంత్ర్య సమర యోధుడు
వున్నవ కీ.శే. లక్ష్మీనారాయణగారు

# కొన్ని జ్ఞాపకాలు

## డాక్టరు చిట్టూరి సత్యనారాయణ

స్ఫుర ద్రూపి, ముఖాన బ్రహ్మ తేజస్సు, జ్యోతిర్మయమైన కండ్లు, తెల్లని ముత్యాలలాంటి పలువరుస, ముఖాన చిరునవ్వుతో, నీర్కావి ఖద్దరు దోవతి కట్టి, బనియను కంటే పెద్దదీ అరచేతుల చొక్కాకంటె చిన్నదీ అయిన శుభ్రమైన అంగరఖాన ధరించి, నిలువు బొట్టుతో అంచులు అద్దిన ఖద్దరు శాలువాతో కన్పించే వారు కీ.శే. శ్రీ వున్నవ లక్ష్మీ నారాయణగారు.

వారు పుట్టింది గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేములూరుపాడు అనే గ్రామంలో 4-12-1877 సం॥ న. శతజయంతి గడిచి పద్నాలుగేళ్లు. ఐర్లండులో బారిష్టరు పట్టం తీసుకొని మద్రాసు తంబుచెట్టి వీధిలో న్యాయ వాదిగా ప్రవేశించారు.

మొదట ఉపాధ్యాయ వృత్తి చేపట్టాలను కొనేవారు. అందుకు శిక్షణ కోసం రాజమహేంద్రవరం వెళ్లారు. అచట శ్రీ కందుకూరి వీరేశ లింగంగారితో పరిచయం కలిగింది. వారు నడుపుతున్న వితంతు శరణాలయానికి కొంతకాలం సూపరింటెండెంటుగ పని చేశారు. వీరేశలింగం గారితో భేదాభిప్రాయం కలగటంవల్ల గుంటూరు చేరి ఉపాధ్యాయ వృత్తి స్వీకరించారు. ఉపాధ్యాయుడుగ ఉంటూనే వితంతు శరణాలయాన్ని స్థాపించారు. అప్పట్లో ఆయనకు న్యాయవాద వృత్తి మీద మనసు పోయి, న్యాయవాద పరీక్షలో ఉత్తీర్ణులై, న్యాయవాదివృత్తి స్వీకరించారు. అదీ నచ్చక ర్యాలీ కంపెనీ అనే విదేశ సంస్థలో క్యాషియరుగా ఉండి - ఆ కంపెనీతో పడక 'బారెట్లా' చదవడానికి ఐర్లండు వెళ్లి, తక్కువ కాలంలోనే. బారెట్లా పట్టం తీసికొని మద్రాసు వచ్చారు.

వున్నవ లక్ష్మీనారాయణగారిని తొలిసారిగ 1932 సం॥లో గుంటూరు శారదా నికేతనంలో చూచాను. అప్పటి నుండి 1958 లో వారు పరమపదించే వరకూ మా యిరువురకూ చాలా సన్నిహిత సంబంధం వుండేది. ఒక పారిజాతవృక్షం ఒక మాలతీలతా - వాటిరెండిటి మధ్యా

గుండ్రంగా కట్టిన పర్ణశాలలోనే మొదటివారి (అదే అప్పటి లైబ్రరీ) మేము మాట్లాడింది. వారి వయస్సప్పుడు నా వయసుకు 3 రెట్లు అయినా సమవయస్కుని ఎట్లా గౌరవిస్తారో నన్నట్లా గౌరవించి, పుస్తక భాండాగార మంతా చూపారు. అప్పుడు శారదా నికేతనంలో కొందరు వార్షికోత్సవ ప్రదర్శనకై నాటకాలు, పద్యాలు, పాటలు, గానకచేరీలకు తయారవుతున్నారు. సంస్కృత 'ముద్రారాక్షసం'లో ఒక ఘట్టం ప్రదర్శనకు సిద్ధమౌతున్నది. సంస్కృతోచ్చారణ విషయంలో పట్టుదలగా ఆ రిహార్సల్స్‌ను జరిపించటానికి లక్ష్మీనారాయణగారు వెళ్లారు - నేను వచ్చేశాను. ఇది మా తొలి సమావేశం.

తర్వాత వేసవి కాలానికి వారు గోదావరి జిల్లాలోని మా ఇంటికి వచ్చారు. గుంటూరు కంటె చల్లనైన ప్రదేశం కావటం వల్ల కొంత విశ్రాంతి కోరి 'పామర్రు' లో ఒక వారం రోజులున్నారు. ఆ రోజుల్లో తెలుగు సారస్వతం అంతా కూలంకషంగ నాకు నూరి పోసేవారు. అప్పుడు వారితో ఒక ముప్ఫై నవలలు వ్రాతప్రతులు తెచ్చారు. ఆ వ్రాతప్రతులేవంటే విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయి పడగలు', అడివి బాపిరాజుగారి 'నారాయణరావు', గుడిపాటి వెంకటచలంగారి 'మైదానం' మొదలైనవి. తెలుగు సాహిత్యంలో హేమాహేమీలు ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి నవలా పరీక్ష పోటీ కోసం వ్రాసినవి. అభ్యుదయ కాంక్షతో ఉన్న 'నారాయణరావు', పాత పద్ధతులను తుచ తప్పకుండా అనుసరించటమే మంచిదేమో అనే ఆదర్శానికి దారి చూపే 'వేయిపడగలు' - ఈ రెండూ ఉత్తమశ్రేణి నవలలుగ తుదకు నిర్ణయింపబడ్డవి.

ఒకసారి వారు 'నారాయణరావు' నవలలోని ఒక ఘట్టాన్ని ఎంతో ఉద్రేకంతో చదివి వినిపించారు. ఆ ఘట్టమేదంటే - ఒక గ్రామీణుడు, తాను పెంచుతున్న కన్యక మానము హరించాడని, తన కొడుకునే తరిమి నాగలితో తల బ్రద్దలు కొట్టడం. ఈ ఘట్టాన్ని బాపిరాజుగారు 'బాలే' రూపంలో వ్రాశారు. వున్నవవారు ఆ సంఘటనతో కరిగిపోయారు. వారికి ధర్మం అంటే అంత ప్రీతి.

వారు గుంటూరు వెళ్లాక మొదలైంది మా ఉత్తర ప్రత్యుత్తరాల చరిత్ర. నేనెంత చిన్నవాడనైనా, ఎంతో ప్రేమతో సమాన స్థాయిలో నాకు లేఖలు వ్రాస్తూ ఉండేవారు. మా ఉత్తరాల్లో సంగతులేమిటో ? నా బాగు, దేశం బాగు, శారదా నికేతన్ కష్టాలు, మధ్యలో ఏచెట్టు మొలిచిందో, మాలతి ఎన్ని పువ్వులు పూచిందో, శారదా నికేతనంలోని పారిజాతం ఎంత ఎత్తు ఎదిగిందో ఇలాంటి కబుర్లతో ఆ ఉత్తరాలు నిండేవి. ఇక్కడ నేనొక చిన్న విషయం చెప్పాలి. ఎన్ని వందల సార్లు మేము 'మాలపల్లి'ని గురించి తర్కించుకున్నామో చెప్పలేను. ఆంధ్ర సాహిత్య ప్రపంచంలో

'మాలపల్లి' నవలపై చేసిన విమర్శనలన్నీ మేము తర్కించుకుంటూనే ఉండేవాళ్లం. కొందరు 'మాలపల్లి'లో కొన్ని ఘట్టాలు ఇంగ్లీషు నుండి అనుకరణ అన్నీ, కొన్ని మట్టుకు ఆ ఊళ్లోని జరిగిన విషయాలే అనీ, ముఖ్యంగా కమల మోహనరావుతో లేచిపోవడం ఆ ప్రాంతాల్లో జరిగిన ఒక వాస్తవిక సంఘటనే అని అనేవారు. అయితే లక్ష్మీనారాయణగారు, ఈ ఘట్టానికి 'లియోటాల్‌స్టాయ్' 'అన్నాకరేనీనా' ఆధారమని నాతో అన్నారు. "అయితే, చూడు 'అన్నాకరెనీనా'ను రైలు క్రింద పడవేసి 'టాల్‌స్టాయ్' చంపేస్తాడు. 'మాలపల్లి'లోని కమల మనసులోనూ రూపంలోను మారిపోయి, పశ్చాత్తాపదగ్ధ హృదయయై రామానాయుడు ఇంట్లో 'సాహూ'కు సేవ చేస్తుంది. నేను పాత్రకు పూర్తిగ న్యాయాన్ని చేకూర్చాను" - అని అన్నారు.

"పంతులుగారు మహా గొప్ప పాత్రలను సృష్టించారు. ఒక్కొక్కరినే ఒక్కొక్క సంపుటములోనూ వరుసగా చంపుకుంటూ వచ్చారు. చివరకు ఎందుకూ పనికి మాలిన ముసలి ముతక పాత్రలను మాత్రం బ్రతికించారు. ఆ బ్రతికించిన ముసలివాళ్లను

ఏమి చేయవలయునో తెలియక తిక మక పడిపోయి విశాల ప్రపంచంలోనికి వదిలి వేశారు'' - అని శ్రీ శ్రీనివాస శిరోమణిగారు 'భారతి'లో ఒకప్పుడు వ్రాశారు.

"పైగా 'మాలపల్లి' నవలలో నాయకుడు సంగదాసు అని అనుకో మని పంతులుగారంటారు. ఆ నాయ కుడు మొదటి సంపుటంలోనే ఖూనీ అయిపోయినాడు. 'మాలపల్లి' నవల దారి తప్పడం అయింది. సంగదాసు కాకుండా, అతని తండ్రి హతుడై పోయి ఉన్నట్లయితే నవల చివరకు అటు ఖేదాంతమో లేక ఇటు మోదాం తమో అయితీరేదని'' కూడా శ్రీ శిరో మణిగారన్నారు.

ఆదర్శం చూపటానికి ఒక మనిషి నూరేండ్లు బ్రతకనూ అక్కర్లేదు; చివరిదాకా మిగిలి ఉండనూ అక్క ర్లేదు. సంగదాసు హత్యే 'మాలపల్లి'కి కీలకం. ఒక్క ఆదర్శ పురుషుని హత్య ఎంత రగడ చేయగలదో, ఆయన ఆదర్శం జీవిత యజ్ఞానికి ఎంత పనికి వస్తుందో, కాలమనే నదీ ప్రవా హం ఆదర్శాలనే ఎన్ని నావలను పయనింపజేయగలదో ఇది చెబుతుంది. తెలుగు వాఙ్మయంలో 'మాలపల్లి' నవల చిరస్థాయి ఉంటుంది'' అని చెప్పేవారు వున్నారు. లక్ష్మీనారాయణ గారికి అతి ప్రియమైన కావ్యకన్యక 'నాయకురాలు'. "పండిత లోకం నాయకురాల్ని మెచ్చుకుంటుంది అని నేననుకునేవాణ్ణి. కాని 'మాలపల్లి'ని మెచ్చుకుంటోంది. దానికి కారణం లేక పోలేదు.''

'నాయకురాలి' గురించి వ్రాస్తూ, "ఉన్నవ లక్ష్మీనారాయణులకు - ఉద్భవమొందింది నాయకురాలని పేరు మోసిన - నాగాంబిక కన్య దీటై వున్నది తల్లిదండ్రులకు ధీరోద్ధతు రాలు, అచ్చమైన తన అంధ్రత్వముచే - నలరుతు వుంటుంది - '' అని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారిని తగిన కృతి భర్తగా నిర్ణయించి కృతి యిచ్చారు.

"'మాలపల్లి' ఆదర్శం ప్రకారం మీ ది సోషలిజమా? హింసా, వాదమా?'' అని అడిగితే సోషలిజమ్, హింసావాదం - ఇవన్నీ మానవ ధర్మాలు కావచ్చు. భగవద్గీత కూడా ఈ ధర్మాన్ని అంగీకరించవచ్చు కాని అంతకంటే పైధర్మమున్నది, అది సత్య ధర్మం. మానవ ధర్మానికి పైమెట్టు. దీనిలో శత్రువును హింసిం చటం లేదు. అవసరమైతే శత్రువు వల్ల తానే హింసింపబడి, దానికి ప్రతి క్రియ తలపకుండ సహించి, తిరిగి శత్రువుని ప్రేమించడమే సత్యవ్రతం'' అని గాంధీగారి సిద్ధాంతం చెప్పేవారు.

1947 లో మనకు స్వాతంత్ర్యం వచ్చింది. కాని ఎన్నిసార్లు ఉన్నా, దేశానికి ఎన్నో సేవలు చేసినా, ఆయన పేరు మాత్రం అసెంబ్లీకిగాని, పార్లమెంటుకుగాని సభ్యత్వంకోసం సూచింపబడలేదు. శ్రీ లక్ష్మీనారాయణ గారి సతీమణి లక్ష్మీ బాయమ్మగారు ఆయనకు చేదోడు

వాదోడుగా ఉండి, శారదానికేతను బాధ్యత తీసికొని నడిపించేవారు. ఆమె అనేకసార్లు జైల్లో ప్రగ్గడంవల్ల, ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. అది వారికి చాలా కలతగా ఉండేది. లక్ష్మీనారాయణగారికి స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీ పరిపూర్ణతలలో చాలా నమ్మకముంది. వారి ఆదర్శం శారదానికేతనే. దేహశక్తిని మన శ్శక్తిని వారు దానికోసమే ధార పోశారు. చివరిదశలో పడరాని పాట్లు పడ్డారు. ఒక సంఘటన చెప్తాను. బాపట్ల ప్రాంతంలో యాభయ్యో, అరవయ్యో ఎకరాల భూమి బంజరుగా ఉంది. అప్పుడు ఓమండూరు రామస్వామి రెడ్డిగారు మద్రాసు ముఖ్యమంత్రిగ ఉండేవారు. మద్రాసులో లక్ష్మీనారాయణగారు మకాము వేసి, ఎన్నో అవస్థలు పడి, శారదా నికేతనానికి ఆ భూమిని సంపాదించారు. అందులో వచ్చే పంట శారదానికేతనకు సంవత్సర లెక్క సరిపోతుంది. లక్ష్మీబాయమ్మ గారికి 'డయాబిటిస్' ఉండటంవల్ల గోధుమ అన్నం తినవలసి వచ్చేది. సెక్రెటరీగా వచ్చిన ఒకాయన కారణంగా వారికా గోధుమ అన్నంకూడ







దొరికేది కాదట. అటువంటి కష్టాలు ఎన్నో.

నేనొకసారి వారి వ్యక్తిగత ఖర్చు లకై కొంత పైకం పంపాను. పంపుతూ "ముఖ్యంగా మీకున్నూ, లక్ష్మీ బాయమ్మ గారికిన్నీ, ఆహారము టానిక్కుల విషయమై" అని వ్రాశాను. వెంటనే జవాబు వచ్చింది. దానితో పాటు రసీదు వచ్చింది, శారదానికేత నానికి ఆ పైకం జమ కట్టబడిందని, జవాబులో ఎవరైనా వ్యక్తి కోసం ఇచ్చినా అది సంస్థకే చెందుతుందని వ్రాశారు.

ఒకసారి నేనెవరినో విమర్శించాను. ఆ సందర్భంలో వారు ఉత్తరం వ్రాస్తూ - "దేశానికి సేవ చేయటానికి నాయకత్వం వహించాలంటే ఎంతో క్షమ అవసరం. వాళ్లతప్పులు కొన్ని మన్నించాలి. అంతేకాని ప్రతివారినీ 'పనికిరాని వారు, పనికి రాని వారు' అనకూడదు" అని వ్రాశారు.

ఆంధ్ర భాష అన్నా, సమగ్ర ఆంధ్ర రాష్ట్రం అన్నా, ఆంధ్రుల తీరుతెన్నులన్నా, ఆంధ్రుల ఆహారం అన్నా లక్ష్మీనారాయణ గారికి ఎంతో ఇష్టం. ఆంధ్ర సంప్రదాయానికి ఆయన ప్రతినిధి. ఆంధ్రరాష్ట్రం రావటానికి ముందు 1952 ప్రాంతం లో ఒక రకంగా మద్రాసునే రాజధానిగా ఉంచి, ఆంధ్రరాష్ట్రాన్ని విడదీయాలనుకున్నారు. లక్ష్మీ నారాయణ గారి దృష్టిలో ఆంధ్ర రాష్ట్రమంటే విశాలాంధ్ర అనే అర్థం. 'మద్రాసు వదిలేస్తే ఆంధ్ర రాష్ట్రం ఇస్తామంటే? మద్రాసు వదులు కుంటారా?' అని నేనడిగాను. మద్రాసు పోతే హైదరాబాదు మనకు రాదా? - అని వారన్నారు. వారి శిష్యురాలు సంఘం లక్ష్మీబాయమ్మ గారు, శారదా నికేతనంలో విద్య పూర్తిచేసి అప్పటి మద్రాసు 'స్కూలు ఆఫ్ ఆర్ట్స్'లో చిత్రలేఖనం నేర్చు కోవటానికి వచ్చారు. తరువాత వారు 'ఎమ్.పి.' కూడ అయ్యారు. వారికి శారదా నికేతనం అప్పగించాలని ఉన్నత వారికి ఉండేది. కాని ఆవిధంగా జరగలేదు.

లక్ష్మీనారాయణ గారి ఆదర్శ మైన సమగ్రమైన స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యం, కళలలో ప్రావీణ్యం, సంస్కృతం, కావలసిన చేతి పనులు మొదలైన పాఠ్య ప్రణాళిక మరల సూర్యకాంతిని చూడలేదు.

వారికి ఇష్టమైన గ్రంథం మహా భారతం; రామానుజుని విశిష్టా ద్వైతం వారి మతా ధర్మం. అస్పృ శ్యత అనే స్పృహ కూడా తనకు లేదని ఒకసారి నాతో చెప్పారు. ఆనాడు అస్పృశ్యులతో సహ పంక్తిని భోంచేసేవారు. తిక్కన కవి ఆదర్శ ఆచార్యునిగ మేధావిగ రాజకీయ ధురంధదునిగ భావించేవారు. స్వాతంత్రోద్యములో ప్రచారం కోసం వారు వ్రాసిన 'బుడబుక్కల జోస్యం' లో వ్యంగ్యం, ప్రేరేపణ చాల మందిని దేశభక్తులను చేసింది. 'భావ తరంగాలు' వారు.

రచించిన పాటలను గీతాలను ఏర్చి కూర్చిన చిన్న పుస్తకము.

నాగమ్మ అనే పడుచు, ప్రేమలో భగ్నత చెంది, పూవు పరంగా పాడు కొంటున్నది :-

'ఈ లోక మర్యాద లిరుకులన్నీ దాటి
ఎగిరిపోయి నాకనో - పువ్వా
ఓపినమట్టుకు - వలపు సంద్రములోన
ఓలలాడుదు గాని -' పువ్వా అని

ఆ పలుకు ఎంత ఉపశమనాన్ని స్తుందో !

వారి వ్రాతల్లో తలమానిక మన దగినది 'కవి తిక్కన'. ఆ నవల సుమారు 500 పేజీలు వ్రాశారు - దాదాపు 30 అధ్యాయాలు వ్రాయా లని. సాహిత్య ప్రపంచపు దురదృష్టం - ఆ వ్రాతప్రతి నాశనమైంది.

దానిలోని భాగం, సంగీత నాపసాని అనే ఒక తునుక మాత్రం మిగిలింది. అసలు సంగీత నాపసాని పేరు గాయత్రి. గాయత్రి లేక లేక పుట్టిన తిక్కనగారి కూతురు. ఆమెను ఒక ప్రాకృతికమైన సంగీత రస దేవతగ, పూర్వజన్మ సంస్కారమంతా రూపుకట్టిన పదేండ్ల పిల్లగ జీవకళా మూర్తిగా తీర్చిదిద్దారు. ఉన్నవ వారి అద్భుత సృష్టి ఆమె.

సంగీత నాపసాని నడకలో లయ ఉంటుంది. మాటలో కవిత్వం ఉంటుంది. ప్రకృతిలో వినిపించే ప్రతి శబ్దానికీ ఆమె 'తాళం' 'లయ' 'రాగం' కనిపెడుతుంది. అందాలన్నీ కలిపి మేలిమి ప్రతిమగా తయారు చేస్తారు. సంగీత నాపసానిని, శ్రీ లక్ష్మీ నారాయణగారు.

'చితారు కొమ్మన మిఠాయి పొట్లం దాచి
ఉంచవే చిలకా
కొతారు కొమ్మన కూర్చొనుండీ 'కో' 'కో'
కోకిలా' — అని

నాపసాని పాట, అట్లాంటిదే ఆమె జీవితం.

ఒకనాడన్నాను. 'మీ విగ్రహం చేస్తాను కూర్చోండి' - అని అంటే అన్నారు "I like to be forgotten" అని.

ఆ రోజున మద్రాసులో మా యింట్లో పూలతీగ వద్ద ఆయన నిలిచి ఉన్నప్పుడు తీశాను వారి ఫొటో. అదే వారి ఆఖరి ఛాయా చిత్రం.



ఇతరుల బుజాలమీద కెక్కి పైకెగ బాకాలనుకునేటంత వరకు, మీ ఆశ యాల నెవరూ తప్పు బట్టరు.

—జోసెఫ్ కాన్రాడ్

బుద్ధి జీవనంలో అమెరికా యితర దేశాలకంటె ఏమంత గొప్పకాదు. కాని, మానసిక మైత్రీ లక్షణంలో అమెరికాను మించిన దేశం మరొకటి లేదు. —సింక్లయిర్ లూయీ

నేను వర్జీనియా రాష్ట్రవాసిని కాదు - అమెరికన్ని.

—1774 లో పాట్రిస్ హెన్రీ





1991 ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక బాగుందని ప్రశంసిస్తూ అభినందన లేఖలు వ్రాసిన పాఠక మిత్రులందరకు మా కృతజ్ఞతాంజలి.

తమకొక కాపీ కావాలంటూ కార్డులూ కవరులూ వ్రాసిన వారికి, కాపీలు లేవనీ లభ్యం కావనీ వినయపూర్వకం తెలియజేస్తున్నాము.

పరిమిత సంఖ్యలో ప్రింటయే పత్రిక ఈ 'జగతి' - విడుదలై, పోస్టుకెళ్లాక మా దగ్గిర ఆఫీసు కాపీలు తప్ప ఇంకేమీ మిగలవు. న్యూస్ స్టాండ్స్ ద్వారా అమ్మకం ఏర్పాటు లేదు - అది మాకు ఒక విధంగా గిట్టుబాటు కూడా కాదు. అందుకనే, ప్రతి నెలా చదవాలనుకొనేవారిని చందాదారులు గమ్మని మనవి చేస్తూంటాము. చందాదారుని ఇంటి గుమ్మంలోకి పోస్టులో వస్తుంది పత్రిక. దేశ విదేశాలలోని పాఠకులకు ఆ విధంగానే అందిస్తున్నాము.

ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక కోసం వ్రాసిన వారికి మా విన్నపం : లోగడ స్త్రీల సంచిక, పిల్లల సంచిక పునర్ముద్రించినట్లే, ఈ విశేష సంచికలోని ముఖ్యాంశాలను, నాలుగు నెలలు పోయాక మామూలు సంచికలో పునర్ముద్రిస్తాము. అరవై చిత్రాల సంక్షిప్త సమీక్షలు, ప్రపంచ సినిమా, భారతీయ సినిమా, స్మృత్యంజలి, మిగతావి అను శీర్షికలు పద్దెనిమిది బొమ్మలతో పునర్ముద్రణ పొందుతాయి.

చందా వివరాలు : 24 సంచికలకు రు 50-00 ; జీవిత చందా : రు 300-00 ; పాట్రన్ : రు 1000-00.

JAGATI, Monthly, 2, Kutchery Road, P.B. 2922 - Madras - 600 004

# కొత్త పుస్తకాలు

"భాగవత తత్త్వము - మానవత్వ ము" - రచన : పప్పు వేణుగోపాల రావు. ప్రచురణ : భాగవత తత్త్వ ప్రచార సమితి, (ఆర్ రంగనాథమ్, అడ్వకేట్, క్రిస్టియన్ లైన్) కడప.... వెల రు 10-90.

'భాగవతంలో భారతీయుల తాత్త్విక ఆధ్యాత్మిక భాండాగారం ఉంది' - అన్నారు స్వామి రంగ నాథానంద, ఈ పుస్తకానికి ముందు మాటగా. పోతనది ఓరుగల్లా, ఒంటి మిట్టా అనే వివాదంలో, ఒంటి మిట్టే అయి వుండాలని, అక్కడి రామా లయంలో ఏటా జరిగే ఉత్సవాన్ని బట్టి, అనేకులు అంగీకరించారు. ఏ ప్రాంతమైనప్పటికీ 'ఇమ్మనుజేశ్వరాధ ములకు' తన గ్రంథం అంకితమివ్వ నని పలికి, హాలికులైన నేమి, కంద మూలాలు తింటే నేమి, అనగలిగిన ధీర స్వాంతం గల మహానుభావుడు, మాన్య చరితుడూను ఆయన.

చెట్టు కుదుటో నీళ్ళు పోస్తే చెట్టు వేళ్ళు ఆ నీళ్ళ పీల్చుకోగా కొమ్మలూ రెమ్మలూ పచ్చదనం దాల్చినట్లే, చతుర్విధ పురుషార్థాలలోని ధర్మాన్ని అనుసరిస్తే, మిగతా మూడూ (అర్థ, కామ, మోక్షములు) వాటంతటవే వొనగూడుతాయనేది భాగవత తత్త్వ సారం. 'ఈశావాస్య మిదం సర్వం' అనే ఉపనిషత్ వాక్యమే ప్రహ్లాదుని నోటి వెంట 'ఇందు గల డందు లేడను సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు' అయింది.

అష్టాదశ పురాణాలలో ఒకటైన వ్యాస విరచిత భాగవతం 12 స్కంధాల 18 వేల శ్లోకాల గ్రంథమని ప్రతీతి; 22 వేలు అని కొందరంటారు; అవి 30 వేల పద్యాలయాయి పోతన కవితా ధారలో. 1848 లో ఆంధ్ర మహాభాగవతము అచ్చయింది. ఇది పూర్తిగా భక్తి రస ప్రధాన మైనది. పరీక్షన్మహా రాజుకు శ్రీశుకుడు ఏడురోజులలో ఈ భాగవత గాథ చెబుతాడు.

శరీరము క్షేత్రమనీ, శరీరధారి క్షేత్రజ్ఞుడనీ, ఈ క్షేత్రజ్ఞుడు అన్ని ప్రాణులలోను వున్నాడనీ తెలుసు కోవడమే 'జ్ఞానము' - అంటుంది భగవద్గీత. అయితే, ఆ జ్ఞానమార్గం బహు కొద్ది మందికే సాధ్యమవుతుంది. కాని, మానవ సముదాయానికి ఉప యోగపడేదీ, 'తన యందు నఖిల భూతములందు నొకభంగి సమహిత త్వం' చూపేదీ భక్తి పథమొక్కటే

ఆ రాణ్మందిరం చేరుకొనేందుకు తొమ్మిది దారులు వున్నాయి : సత్యము, శ్రవణం, దాస్యం, వందనం, అర్చనం, సేవ, ఆత్మార్పణ, సంకీర్తన, చింతన.

'చదువులలో మర్మమెల్ల చదివిన' ప్రహ్లాదుడు, 'దుర్బలులకు బల మెవ్వడు ?' అని ప్రశ్నించిన గజేంద్రుడు, 'కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందిరే - వారేరీ సిరి మూట గట్టుకొని పోవం జాలిరే' అని పలికిన బలిచక్రవర్తి - యిలాటి ఉపాఖ్యానాలలో భాగవతంలో మనకు కనిపించేది భక్తి రసంతో పునీతమైన మానవ ఔన్నత్యం. ఈ రోజులలో భాగవతం చదివే వోపిక లేకపోయినా, పప్పు వేణుగోపాలరావు రాసిన ఈ పుస్తకం చదివి, భాగవతం తెలుగువారికి ఎందువల్ల అంత పూజనీయమైనదో తెలుసుకోవచ్చు. కమలాక్షు నర్చించు కరములు .... మందార మకరంద మాధుర్యమున .... యిలాటి పద్యాలు చిన్నప్పుడు కంఠస్థం చేయని విద్యార్థి తను తెలుగువాడినని చెప్పుకోవడం సిగ్గుచేటు. యజ్ఞ యాగాదులు వద్దనీ వారిస్తూ కృష్ణుడు నందునితో అంటాడు : 'కర్మమున బుట్టి జంతువు - కర్మమునను వృద్ధిపొందు, కర్మమున జెడుం - కర్మమె జనులకు దేవత - కర్మమె సుఖ దుఃఖములకు కారణ మధిపా' .... ఇక్కడ కర్మ అంటే ఖర్మ కాదు, యాక్షన్ (action). భాగవతంలో మానవతా విలువలు ఎంతటి ఉన్నత ప్రమాణంలో వున్నాయో చూబుతారు పప్పు వేణుగోపాలరావు.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

'రాణీ రుద్రమదేవి' - రచన : యన్ మంగాదేవి. ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు–1.... వెల : రు 8-00.

కాకతీయ రాజవంశ స్థాపకుడు ప్రోలరాజు - పాలకులు జైనులు. త్రిలింగ ప్రాంత ప్రజలు శైవులు, శివ వైష్ణవాలు రెండూ, జైన బౌద్ధాలతో పోరాడిన కాలమది. 'కాకతి' అనే అమ్మవారిని కొలిచేవారవడం చేత వారు కాకతీయులయారు. రాజలాంఛనం వరాహం (విష్ణుమూర్తి కూర్మావతారం) ; రాజకేతనం గరుత్మంతుడు. ఈ రాజ వంశంలోని గణపతి దేవునికి మగపిల్లలు లేరు ; కూతురు రుద్రమకు వీరభద్ర భూపతితో వివాహం జరిపించాడు. ముగురు పిల్లల తల్లి అవుతుంది. ముగ్గురూ ఆడపిల్లలే అవడం, వీరభద్రుడు మరణించడమూతో, మంత్రి సామంతాదుల సలహామీద రుద్రమకు రాజ్య పట్టాభిషేకం చేస్తాడు గణపతి దేవుడు. రుద్రమదేవి తన కూతుళ్ల ముగ్గురికీ రాజనీతితో ముడివడ్డ వివాహాలు జరిపిస్తుంది. వీరభద్ర భూపతి మొదటి భార్య (రుద్రమ రెండో భార్య) కుమారులు హరిహర మురా

రులూ, మూడవ అల్లుడు (మూడవ కూతురు ముమ్మడమ్మ భర్త) మహా దేవరాజూ ఈ కాకతీయ సామ్రాజ్యాన్ని తమ హస్తగతం చేసుకోవాలని కుట్రలు పన్నుతారు. సవతి కుమారులిద్దరూ యుద్ధభూమిలో చనిపోతారు; మూడవ అల్లుడికి బుద్ధి చెప్పి వొది లేస్తుంది. ఆ మూడవ అల్లుని కుమారుడు ప్రతాపరుద్రుని, అంటే మనుమణ్ణి దత్తత చేసుకు, కాకతీయ సామ్రాజ్యానికి (13వ శతాబ్ది) అతనిని వారసునిగా చేస్తుంది రుద్రమదేవి.

తకు, యుద్ధ కౌశలాసక, ప్రతిభా చెబుతారు రాణీ రుద్రమదేవిని.... మూడురోజులపాటు నిద్రాహారాలు, అన్నపానాదులు లేకుండా, కాభోయే భర్తతో రుద్రమ యుద్ధం చేసి, తనకు సమవుజ్జీ అని తెలుసుకున్నదంటే, ఎంతో వీరోచితంగా కనిపించినప్పటికీ, నేటి బాలబాలికలు నమ్ముతారా అని!.... మేస్టారు ఈ కథని విద్యార్థినీ విద్యార్థులకు చెప్పడం, వారిని ఓరుగల్లు 'ఎక్స్‌కర్షన్‌కి' తీసుకెళ్లడం - ఆ ఫ్రేములో బిగించారు ఈ చారిత్రక కథను రచయిత్రి మంగాదేవి. పిల్లలు వేసే ప్రశ్నలు కొన్ని చోట్ల చాలా సహజంగా ఉన్నాయి. కథ చెప్పేందుకు యిలాటి ఫ్రేము కావచ్చు.

—దయానిధి



## పేద విద్యార్థులకు ఉపకార వేతనాలు

# కళాసాగర్

ఇరవై సంవత్సరాలుగా మద్రాసులోని 'కళాసాగర్' సాంస్కృతిక, సినిమారంగాలకు చేస్తున్న సేవ విజ్ఞులందరికీ విదితమే. ముఖ్యంగా ప్రసిద్ధి చెందిన తెలుగు రంగస్థల నాటకాలు, ప్రయోగాత్మక నాటికలను ప్రదర్శించే బృందాలను మద్రాసుకు రప్పించి, వాటిని ప్రదర్శింపజేసి, ఎందరో కళాకారులను ప్రోత్సహిస్తోంది. ఇటువంటి సాంస్కృతిక కార్యక్రమాలకే పరిమితం గాక - సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు దోహదం చేయడంలో కూడా 'కళాసాగర్' ముందుంటున్నది.

పేద రంగస్థల కళాకారుల సంతానానికి విద్యా సదుపాయాలు అందజేసే నిమిత్తం - గోరంట్ల ఛారిటీస్‌తో కలిసి - గత పన్నెండు సంవత్సరాలుగా ఉపకారవేతనాలు అందజేస్తూ వుంది 'కళాసాగర్'

పదవ తరగతిలో ఉత్తీర్ణులైన తమ సంతానానికి ఉపకార వేతనాన్ని ఆశించే కళాకారులు, తమకు సంబంధించిన వివరాలు తెలియజేస్తూ - విద్యార్థి చదువు వివరాలు, మార్కుల జాబితా, పై చదువులకు సంవత్సరానికయ్యే వ్యయం (ఫీజులు, పుస్తకాలకైన ఖర్చు రసీదుల నకళ్లు జతపరచాలి) మొదలైన అంశాలను వివరంగా రాసి, శ్రీ జి.పి.ఎన్. గుప్త, ఉపాధ్యక్షులు - 'కళాసాగర్', 5, సర్ త్యాగరాయ రోడ్, మద్రాసు - 600 017 అన్న చిరునామాకు 31-7-91 లోగా పంపించాలి.

వచ్చిన దరఖాస్తులలో - అర్హులని భావించిన వారికే ఆర్థిక సహాయం అందజేయబడుతుంది. ఈ విషయంపై ఎలాంటి ఉత్తరప్రత్యుత్తరాలు జరపలేమని 'కళాసాగర్' కార్యదర్శి ఎం. ఎ. సుభాన్ తెలియజేస్తున్నారు.

సింహాసన మనగా ఏమున్నది ? ముఖ్‌మల్ కుట్టి, రాళ్లు పొదిగిన కఱ్ఱ కుర్చీ.

నేనే ప్రభుత్వం. ప్రభుత్వమే నేను. నేనే ఈ ప్రజల నిజమైన ప్రతినిధిని.

మీకు కావల్సిన ఏదైనా నన్ను నిరభ్యంతరంగా అడగవచ్చు కాని, కొంచెం టైము యివ్వమని మాత్రం అడక్కండి.

నేనేదైనా పొరబాటు చేసివున్నా, పది మందిలో దుయ్యబట్టకూడదు - మురికి బట్టలు నడివీధిలో వుతుకుతారా ఎవరైనా ?

—నెపోలియన్

పీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ  డాక్టరు నాగార్జునకు అందాల పాలవెల్లి లావణ్య ఒక పేషంటు ; అనురాగాలు చిందించే విశాల - సివిల్ ఇంజనీరు - తనతో జీవితం పంచుకోనున్నది. తన అనునయ వాక్యాలు, ఆప్యాయత వెద జల్లే కబుర్లు, లావణ్యను ఆశల పల్లకీలో తిప్ప వచ్చు కాని పేషంటు పేషంటే. మృదు వచనం తన వృత్తిధర్మం. లావణ్యది మంచి మనసే, కాని....  ఇక చదవండి.

"త్వరగా చావు.... ఇంతా కష్టపెడు తున్న.... నీకు చావు రాదేంటి అని గొడ్డుని.... కొట్టినట్లు, కట్టేసి కొడ తారు. మమ్మీ, ప్లీజ్, ఇంక మీ మాట .... జవదాటను .... ఉద్యోగం చేసి సంపాయించుకుంటాను, మీకు.... నేను భారం కాను" కన్నీరు మున్నీరుగా విలపిస్తూ అడిగింది శమ్మి

ఫోన్ రింగయింది - విశాల రిసీవ్ చేసింది.

కూతురిని అక్కున చేర్చుకు పైట కొంగుతో కన్నీళ్ళు తుడిచి.... "ఇంత చిన్న వయసులో ఇన్ని కష్టాలు ఎలా భరించ గలిగావు తల్లీ!" అంది రుద్ద మైన స్వరంతో తల్లి.

"హలో విశాలా ....నేను చందన్ని".

"తెలుసు"

"ఏమిటే తల్లీ, ఏమూడ్‌లో వున్నావ్ ?"

"ఏ మూడూ లేదూ.... విషయం చెప్పు".

"నా కెందుకు మధ్య.... మీ అత్తగారు .... రింగ్ చేయమన్నారు. మీరే మాట్లాడుకోండి...." అని రాజేశ్వరి చేతికిచ్చింది ఫోన్ చందన.

"  "

"నమస్కారం, ఆంటీ"

"ఆఫీసుకి వెళ్ళే ముందు ఇక్కడకు టయముంటుందా.... ?"

"ఇప్పుడు నైన్ కావస్తుందీ....,"

"పోనీ, సాయింకాలం వస్తావా...."

"తప్పకుండా ఆంటీ"

### 42

సాయింకాలం.... ఆఫీసు నుండి నేరుగా చందన వాళ్ళ ఇంటికి కెళ్ళింది. రాజేశ్వరి ఎదురై.... చిరునవ్వుతో లోపలకి తీసుకెళ్ళింది విశాలను.

షాపులో నుండి తెచ్చినవి,.... తెప్పించినవి.... చీరలు.... నగలు.... అన్ని అక్కడ పెట్టి, "విశాలా, వీటిల్లో నీకు కావలసినన్ని సెలెక్ట్.... చేసు కోమ్మా !.... మొహమాట పడవద్దు"

అని చెప్పింది రాజేశ్వరి. చీరలు నగలు ధగ ధగ మెరిసిపోతున్నాయి.

విశాల అభిమానంతో ముడుచుకు పోయింది.

రాజేశ్వరి వైపు చూచి.... "నాకు వీటన్నటి మీద అంత ఇంట్రెస్ట్ లేదాంటీ. మీకు నచ్చినవి.... మీరు తీసి పెట్టండి.... అవే నాకు ఇష్టం - అయినా ఇప్పుడు ఇవన్ని ఎందుకు ?" .... అంది నెమ్మదిగా.

చందన, నుదిట చిన్నగా అరచేత్తో కొట్టుకొని, "అయ్యో కర్మ ఈ అత్త గార్కి.... ఈ కోడలకి సరిపోయింది జత."

"సరేలేవే.... పిచుకా.... నీలాగ లొడా లొడా మాట్లాడే సే య మంటావా? నీవు నేర్చుకో ఆ మర్యాద, మన్నన" అంది గ్రాండ్ మా శాంతమ్మ.

"ఓ స్వీటీ వదినమ్మగారూ.... త్వరగా సెలెక్టు చేసుకోండి"

"నీవు.... సెలెక్టు చేసి పెట్టు"

'ఈ మాట చెప్పేందుకా నిన్ను పిలిచింది, మమ్మీ - సరేలే ఏమి చేస్తాం - నాకు తప్పుతుందా....? రెండు చీరలెత్తి విశాలకు బుజాలపై వుంచి, ఆ - ఇవి బాగానే వున్నాయి" అనేస్తూ పక్కన పెట్టింది. చందన అలా నాలుగైదుసార్లు చేశాక, రాజేశ్వరే విశాల మెడలో ఒక నెక్లెస్ వేసి చూసి, చందూని అద్దం పట్టుకు రమ్మంది.

"ప్లీజ్, ఇవన్నీ ఎందుకాంటీ.... మీరు పిలిసే ఎందుకో.... అనుకొని వచ్చాను నాకు నగలమీద.... చీరల మీద ఆసక్తిలేదు. మీ తృప్తికోసం .... రెండు చీరలు, ఒక్క నగ సెలక్టు చేయండి.... అదయినా.... మీ తృప్తి కోసమే. నే ని లా చెపుతున్నానని మరోలా అనుకోవద్దు."

"ఇదిగో స్వీటమ్మా ! మీ అత్త గారు చీరలు నగలు.... పాత అబా రాలు నమ్ముకున్న అసలు సిసలైన భారతనారి.... నీవు వద్దన్నా విడిచి పెడుతుందనుకోకు.... నేనయితేనా ఈ పాటికి బోలెడన్ని సెలెక్టు చేసుకొని వుడాయించేదాన్ని

విశాల చెవిలో మెల్లగా చందన.

"రా, నాయనా, నాగార్జునా, అక్కడే నిలుచున్నావే" - శాంతమ్మ పిలుపుతో అందరూ అటు చూశారు. విశాల కూడ చూసింది. అతని చూపులకు ఆమె తనువు తీపిపూహల జడివానలో తడిసి పోతున్నట్టు గిలిగింతలు పెట్టింది.

నాగార్జున లోపలకు వచ్చాడు. రాజేశ్వరి చూపించింది. నగలు, చీరెలు "మమ్మీ, ప్లీజ్, వీటి విషయం మీకు మటుకే ; నాకు తెలీదు"

అక్కడ జరుగుతున్న ఆ ఆడవాళ్ళ వ్యవహారం అతనికి పట్టనట్టు సోఫా లో కూర్చుని పేపరు ఓరగా పెట్టి, విశాలను చూస్తున్నాడు.

చందన వచ్చి.... "అన్నయ్యా పగటిపూటే కలలు కంటున్నావా"- అంది.

"ఇవి పగటి కలలు కాదు".

"మధుర స్వప్నాలు" - చందన చిలిపిగా.

## 43

"విశాలా.... శమ్మి అత్తగారు ఫోన్ చేసింది.... శమ్మిని వెంటనే పంపించ మని. పెళ్ళిలోగా, వాళ్ళతో తగవు దేని కని,.... అసలు విషయం చెప్పకుండా, విశాలకు పెళ్ళయ్యాక పంపిస్తామని చెప్పాను" .... చెప్పింది ప్రమీల.

"మంచిపని చేశావు మమ్మీ" అంది విశాల.

వాకిట్లో నుండే ఎగురుతూ వచ్చాడు రాజేష్. వస్తూనే సూర్యా రావు గదిలోకి ప్రవేశించాడు....

"ఏమిటి మామయ్యా.... ఇంత.... మోసం? విశాలను నాకిచ్చి పెళ్ళి చేస్తానని, మాట తప్పుతావా?.... విశాల ఉద్యోగంలో చేరి, సెటిల్.... కావాలన్నావు ...." ఉక్రోషంగా అడిగాడు.

"ఆఁ.... అవును సెటిల్ అయ్యాక దాని ఇష్టం అనికూడా చెప్పాను"

"నాకు.... అంతా తెలుసు.... ముందే వాళ్ళిద్దరకు సంబంధం వుందని కూడా తెలుసు"

"ఛీ.... నోరు ముయ్యరా.... అలా కూసేందుకు నోరు ఎలా వస్తోందిరా" విపరీతమైన కోపంతో అన్నాడు సూర్యారావు.

ఆయనకు కోపంవస్తే అందరికి భయం.... గుండెనొప్పి వస్తుందని.

'డాడీ.... ఆవేశపడవద్దు.... డాడీ, ప్లీజ్, మాట్లాడవద్దు.... రాజేష్, మా స్వంత విషయాలల్లో జోక్యం కలిగించు కునేందుకు,.... నీవెవరు? .... చుట్టం రీతిగా వచ్చినపుడు మర్యాద ఇచ్చి పుచ్చుకోవటం మంచిది ...." అంది విశాల.

"హు చుట్టం అట.... ఎంగేజ్ మెంట్ తెలియకుండా చేసుకున్నారే, పిలిస్తే మీ పెళ్ళి ఆగిపోతుందనా? చూస్తూ వుండండి మీ బ్రతుకులు ఏమౌతాయో!"

"రాజేష్, వెళ్ళు.... ఇక్కడ నుండి ....నాకు కోపం వస్తోంది...." గుండె మీద చేతి నుంచుకుని గట్టిగా అరి చాడు సూర్యారావు.

"డాడీ.... మీరు వూరుకోండి... రాజేష్, ముందు నీవిక్కడ నుండి... వెళ్ళిపో...." అంది విశాల ఆజ్ఞాపిస్తు న్నట్టు.

"అలాగే వెళ్ళిపోతాను.... నీకీ పెళ్ళి ఎలా జరుగుతుందో ... చూస్తాను" - ఛాలెంజ్ చేస్తున్నట్టు అనేసి వెళ్ళిపోయాడు రాజేష్.

సూర్యారావుకి టాబిలెట్ ఇచ్చి నీళ్ళు తాగించి పడుకో బెట్టింది విశాల.

జీవితంలో ఓడిపోయినట్టు దిగులు తో ఓమూల నిలుచుండిపోయింది. శమ్మి.

ప్రమీల కళ్ళల్లో కన్నీటి ధార. సూర్యారావు పడుకున్న మంచం కాళ్ళ దగ్గర కూర్చుంది. ఆమెలో అమితమైన ఆందోళన. రాజేష్ చాలా చెడ్డవాడు. ఎలాంటి విపరీతాలు సృష్టిస్తాడో, ఏ కీడు తలపెడతాడో....

## 44

ఆరాత్రి సూర్యారావు గుండెబాధ ఎక్కువైంది.

"హస్పటల్‌కు పోదాం, డాడీ" అంది విశాల.

"వద్దమ్మా.... తగ్గకుంటే ప్రొద్దుటికి వెళదాం. టాబిలెట్ తీసుకున్నానుగా! ఏమి ఫర్వాలేదు" విశాల తలమీద తన చేతి నుంచాడు వాత్సల్యంతో.

తెల్లవారింది.... ఆయనకు గుండె నొప్పి అలాగే వుండటంతో విమ్మిని.... శమ్మీకి తోడుగా వుండమని చెప్పి సూర్యారావుని.... హస్పటిల్‌కు తీసికెళ్ళారు ప్రమీల, విశాల.

డాక్టరు ధైర్యం చెప్పినా, తండ్రిని అలా వదిలి వెళ్ళటం ఇష్టంలేదు. కాని, తప్పనిసరి.... అయింది. మరునాటి నుండి మ్యారేజికి లీవు తీసుకోబోతుండటం వలన, .... వేరే ఇంజనీర్‌కి.... ఫైల్స్, ప్లాన్స్, అందజేయాలి గనక ఆరోజు లీవుతీసుకోవటం వీలుకాలేదు. విశాల ఆఫీసుకు వెళ్ళింది.

## 45

రాజేష్ వచ్చి పిలిచాడు..... "విమ్మి, మనం.... అలా వెళ్ళొద్దాం.... రా" అని. కిరాతపు చేష్టలు అనుభవం పొందిన శమ్మి, విమ్మిని వెళ్ళొద్దని.... వారించింది, కాని విమ్మి వినలేదు. 'హాఫాన్ అవర్‌లో వచ్చేస్తాను' అని చెప్పి రాజేష్‌తో వెళ్ళిపోయింది. శమ్మి ఒంటరిగా మిగిలిపోయింది.

అరగంట అని చెప్పివెళ్ళిన విమ్మి ఒకగంట తరువాత.... వచ్చింది రాజేష్‌తో. శమ్మి ఇంట్లో వున్న సూచన లేమీ ఆమెకు.... కనిపించలేదు. మనసున ఏదో అనుమానం వేధిస్తుండగా ఇల్లంతా.... వెతికింది. ఎక్కడా కనిపించలేదు; వణికిపోయింది. ఆమెకు చాలా భయం వేసింది. శమ్మి ఏమైనట్టు? ఎక్కడికెళ్ళినట్టు? సోఫాలో తీరిగ్గా కూర్చుని సిగరెట్ తాగుతున్న రాజేష్ దగ్గరకు వచ్చి.... "ఇప్పుడెలా, రాజేష్, శమ్మి కనిపించలేదే" అంది ఆందోళనగా.

సిగిరెట్.... పొగను రింగుల వలయంగా పైకి వదలి....

"ఏముంది.... హాయిగా వుండు.... మీ అమ్మ, నాన్న వచ్చి.... చూసుకుంటారు.... అన్నాడు తేలిగ్గా.

"ఏమిటి, రాజేష్ నీకంత తేలిగ్గా వుందీ విషయం? శమ్మి ఎలాంటి పరిస్థితులతో చిక్కుకుని వుందో తెలుసా?"

రాజేష్ నవ్వాడు.... ఆ నవ్వులో ఎన్నో అర్థాలు అయితే, వాటిని.... అర్థం చేసుకునే స్థితిలో లేదు విమ్మి.

"ఈ నౌకరు కూడా ఎక్కడ చచ్చినట్టు? తలుపులన్నీ తెరిచే వున్నాయి. మళ్ళీ ఇల్లంతా తిరుగులాడింది. బాత్రూమ్‌లో నుండి ఏదో శబ్దం వస్తూంటే.... అక్కడే నిలబడి గ్రహించింది. లోపల ఎవరో వున్నారు. ఏదో జరిగింది.... ఏమయింటుంది? బాత్రూమ్‌లో ఎవరూ. శమ్మి వుంటుందా? ఆత్మహత్య చేసుకుందా?" (ఇంకావుంది

JAGATI Telugu Monthly - Vol. 36 - No 42[illegible] - July 91
Edited, Printed and Published by N. R. Chendur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras - 600 004
Phone: 7 6 6 3 7